

లియో టాల్‌స్టాయి

జననము : యాస్నాయా పోల్యానా, టూలా

9, సెప్టెంబరు 1828

నిర్యాణము : అస్టపోవో, రియాజాన్

21, నవంబరు 1910

పాడిమాటలుగా నుండును. మాకు వ్రాఁత చేతకాదు. మాకు వచ్చిన కథలను మేము బిడ్డలకు చెప్పుచుందుము. ఆదివారములందును, సెలవురోజులందును పెద్దలుకూడ కథలు వినుటకు మాకడకు వచ్చుచుందురు. కథలు చెప్పుకొను చున్నంతసేపు మాకు ఉబుసుపోవును; కాయకష్టము కనఁబడదు. మాకు పురాతనకాలపు జానపద గాథలెన్నో వచ్చును...'' అనుచు, ఆ వృద్ధులలో నొకఁడు ఒక పాత 'పదము' పాడ నారంభించెను.

అటువంటి గాథను టాల్స్టాయి అంతకుమున్నెన్నఁడును వినియుండ లేదు. ఆ పదగుంఫన అపూర్వముగ నుండెను. ఆ ముసలివాని కంఠస్వరము నీరసముగ నున్నను, విన సొంపుగ నుండెను.

టాల్స్టాయి పొందిన ఆనందమునకు మేరలేకపోయెను. వెంటనే వారితో 'రండి, మిమ్ములను ఆ కథలతాతయ్య బసకు దీసికొనిపోదును' అనుచు, వారిని తనవెంట తోడ్కొనిపోయెను. పోవునప్పుడు టాల్స్టాయి మనసున ఈ వృద్ధుల నెటులాదరించుటా, అను ఆత్రమే ఆవరించియుండెను. వారు చెప్పెడి కథలను అందఱను ఆలకించవలెననికూడ టాల్స్టాయికి కాంక్ష పట్టుకొన్నది.

అంతలోనే మరల ఆ వృద్ధులు 'అయ్యా! మమ్ములను ఆ కథల తాతయ్య యొద్దకే కొనిపోవుచున్నావా?' అని ప్రశ్నించిరి.

'అవును. మీ ఎదుటనున్నవాఁడే ఆ కథలతాతయ్య!' అని బదులిడినాఁడు టాల్స్టాయి, పాటపాడుచున్న వృద్ధునితో.

'నిజమా...!' అని అచ్చెరువందుచున్న వృద్ధులలో నొకఁడు నిర్ఘాంతపోయి అడిగెను. 'అవునవును. నేను బొమ్మలలో చూచిన రూపమే సరిగా తోయునది. కాని, తాతయ్యా! నీ ముఖము విచారముగ నున్నదే?' అన్నాఁడు రెండవ యతఁడు. ఇటులనుచు, ఇరువురును టాల్స్టాయిని ప్రేమ యుట్టిపడునట్లు గట్టిగ కౌఁగిలించుకొనిరి.

'కాదు, అందు కొంతమంది మా యింటికి వచ్చిన అతిథుల బిడ్డలు' అని టాల్స్టాయి జవాబిచ్చెను.

అప్పుడే భోజనాలకు లెమ్మని గంట మ్రోగెను.

ఆ వృద్ధు లిరువురును అక్కడే ఆగి, 'తాతయ్యా! — ఇక చాలు. కన్నులార నిన్ను చూచితిమి. మే మింటికి పోయెదము' అనినారు.

'అదేమి? మా యింటికి వచ్చి, నాతో గూడ పాపాటుచేసి వెళ్లరా?' అని విస్మయముతో టాల్స్టాయి ప్రశ్నించెను.

'ఊహూఁ; నీ కథలనుబట్టి మేము ఊహించినది ఒకటి; ఇక్కడ కన్నులార చూచుచున్నది వేఱొకటి. ఈ వైభవమును చూడ, నీయందు మేము ఊహించిన ఆ నిరాడంబరమూర్తిని కానలేకున్నాము. మాకు కావలసిన కథలను నీవు చెప్పఁజాలవు'—అనుచు వారు గిఱుక్కున మరలి పోయిరి. టాల్స్టాయ్ వారి మాటలను మననము చేసికొనుచు, నిశ్చేష్టుఁడై నిలువఁబడిపోయెను.

నాఁటినుండియే టాల్స్టాయ్ జీవితములో గొప్ప పరివర్తన కలిగినది.

'కథల తాతయ్య' టాల్స్టాయ్ కర్షకులకొఱకు వ్రాసిన పెక్కు కథలలో ఈ 'The GODSON' అనునదియు నొకటి.

# విషయానుక్రమణిక

# 1. నామకరణము

మన దేశ మతి విచిత్రమైనది! ఏలయన - మనలో మనుజున కొక మతము, మండలమున కొక భాష కలదు. పురాతన మతములలో నొకటి యగు క్రైస్తవమతమునకు చెందిన వాఁడు లాజరసు. లాజరసు సుగుణసంపన్నుఁడే, కాని పుట్టు పేద. ఐనను ఆతఁడెట్టి లోపము లేకుండ జీవితములో నేఁబది వసంతములు గడపినాఁడు. కాని, సంతతి లేకపోయెనే యను నొక్క కొఱఁతమట్టు కాతని మనస్సులో తీరని కోరికయై నిలిచి పోయినది.

ఇటు లాతఁడు విచారించుచుండ, కొద్దికాలమునకే దైవకృపవలన లాజరసు తపము నెఱవేఱినదా యనునట్లు, వరప్రసాదముగ నొక బిడ్డఁడు కలిగినాఁడు. లేక లేక పుట్టిన ఆ బుడుతని నపురూపముగఁ జూచుకొనుచు, లాజరసు దంపతు లానందాబ్ధిలో మునిఁగి తేలుచుండిరి.

క్రైస్తవమతములో నొక యాచారమున్నది. అది యేమియందురా?-మనలోవలె బిడ్డఁడు పుట్టినప్పుడు నామకరణము జరుపువారు జననీజనకులు కారు. వారి యాప్తులో, ఆత్మీయులో, క్షేమము కోరువారో, యొక పురుషుఁడు నొక స్త్రీయును వచ్చి కార్యము జరిపించెదరు. ఇట్లు పైనుండి

* 1886-వ సంవత్సరములో టాల్‌స్టాయిమహాశయుఁడు రచియించిన 'The Godson' అను కథ దీనికి ఆధారము.

వచ్చిన ఆ స్త్రీ పురుషులను 'దేవమాత,' 'దేవపిత' అని యందురు.

ఇప్పుడు లాజరసున,కట్టి యవసరము కలిగినందున, అతఁడు పొరుగింటి యజమానునియొద్దకు పోయి, "బాబా!- దైవకృపవలన ఈనాఁటికి నా కొక కుమారుఁడు కలిగినాఁడు. రాఁబోవు శుక్రవారమునాఁడు నామకరణ మహోత్సవమును పెద్దలు నిశ్చయించినారు. అగుట, తాము దేవపితగా నుండి, నిర్విఘ్నముగ కార్యము జరిపించి, శిశువును దీవింపఁ గోరుచున్నా" ననినాఁడు.

ఇందులకు పొరుగింటి యజమాని "అన్నా, లాజరసూ! రాక రాక మంచి పనిరద్దీలో వచ్చితివే! ఇప్పు డిరువదినాల్గు గంటలును మా పనికే సరిపోవుటలేదు. ఇఁక నీవంటి మిత్రుని మాట కొట్టివేయవలసి వచ్చెనే యని కించపడుచున్నాను. కొంచెమైన తీరిక యనునదున్నచో నిన్ను తప్పక సంతోష పెట్టెడివాఁడనే! ఇప్పటిమట్టున కెవరినైన పిలుచుకొనిపోయి పని జరిపించుకొను''మని బదులుచెప్పి, తప్పించుకొనినాఁడు.

ఈమాట వినినదే "అవును కాఁబోలు, పొరుగింటాయనకు నిజముగనే తీరిక లేదుకాఁబోలు" ననుకొన్నాఁడు అమాయకుఁడగు లాజరసు. వెంటనే మఱియొక హితుని యొద్దకు వెళ్ళి, సంగతి సందర్భములు మనవిచేసి, 'ధర్మపితగా నుండఁగలరా?' యని అడిగినాఁడు. లాజరసు చెప్పినదెల్ల శ్రద్ధతో నాలించి, చివర కా మిత్రుఁడు కూడ ఏదో సాకు చెప్పి, అతని పీడ వదలించుకొన్నాఁడు.

'ఇదేమిరా భగవంతుఁడా!—ఎక్కడికి పోయినను నున్నపుపిడత యెదురగుచున్నదే! ఇట్టి సంతోష సమయమున మాట దక్కకపోవుట చూడ, నిదేదో అపశకునమని తోఁచుచున్నయది. నమ్మిన ప్రాణమిత్రులు సయితము 'నావలనఁ గాదు' అనుట రోజుల మాహాత్మ్యముగాక వేఱేమి? ఇంతకును తలపెట్టిన శుభకార్య మాఁగిపోవునా!' అనుచు నిట్లు పరిపరివిధముల చింతింపసాఁగినాఁడు లాజరసు.

చింతించి ప్రయోజనమేమి? ఊరిలో నెఱిఁగినవారి నందఱిని పేరుపేరున ప్రార్థించెను. అందఱును వీలుకాదనిరి. పరిచితులఁగూడ పట్టి చూచెను. 'ససేమిరా, వీలుకా'దని మొగమోటమి లేక చెప్పివైచిరి. ఇటు, లోకరికిఁ గాకున్న నౌకరికైనఁ గనికరము లేకపోవుటఁ గని, ఇఁక సొంతయూరియాశ నాతఁడు వదలుకొనినాఁడు.

"ఇది పుణ్యకార్యముకదా! ధర్మచింత కలవారెక్కడనైన లేకుందురా? అట్టివారు కొలఁదిమందియైన లేకున్న ప్రపంచ మీమాత్రము నిలువఁబడియుండునా? నవనాగరకత సోఁకియుండని పల్లెపట్టులందు పారమార్థిక చింత గలవా రెక్కువగ నుందురని విందును. అందుచే సమీపములో నేదేని యొక గ్రామమునకు పోయి, యే మహానుభావుని కాళ్లయినను పట్టుకొనెదను. ఇంతకును, కార్యము సఫలమగుట, కాకపోవుట యా ప్రభుని యధీనము. కాని మన చేతిలో నేమున్నది!" అని తలపోసికొనుచు, లాజరసు పొరుగూరికి బయలుదేఱినాఁడు.

లాజరను నెమ్మదిగ నడుగులు వేసికొనుచు సాఁగిపోవుచుండ దారిలో నొక పెద్దమనుష్యుఁ డగపడి "ఏమోయి మామా!—ఎన్నఁడు లేని దీకోజున నిటువైపు బయలు దేఱితివే?" యనుచు పలుకరించినాఁడు.

అందులకు లాజరను "నాయనా!-వయఃకాలములో కన్నుల వైకుంఠమై, వార్ధక్యములో రెక్కలకు ఆసరాయై, పరమపదించిన తదుపరి ఆత్మశాంతి కోరి గతులు కల్పించుటకని పరమేశ్వరుఁడు నాకొక పుత్రుని ప్రసాదించినాఁడు. రాఁబోవు శుక్రవారమునాఁడే నామకరణ మహోత్సవ మేర్పఱచినారు పెద్దలు. అగుట, శ్రమ యనుకొనక దయయుంచి, దేవపితగా వచ్చి కార్యము జరిపించి, ముద్దుబిడ్డని దీవించి పొందని యూరిలోన దలఁచుకొనినాఁడను. కాని, పుట్టుపేదనైన నావంటివాని పూరికొంపకు వచ్చి కూర్చుండుట కెవ్వరికిని మనస్సొప్పనట్లు గ్రహించితిని. ఏమన, ఎన్నఁడును మాటఁ దీసివేయని ప్రాణమిత్రులు సయిత మీ యదనున తమకు తీఱిక లేదని నిష్కర్షగఁ జెప్పివేసినారు. పోనిమ్ము, పొరుగూరిలో నే ధర్మాత్ముఁడైన దయతలఁచి కార్యము జరిపించి పుణ్యము కట్టుకొనక పోవునా యనునాశతో నిపుడు బయలు దేఱినాను. మఱి, దైవకృప యెటులుండునో!" యనుచుఁ గల్లయుఁ గపటము లేకుండ మనస్సులోని ఆతురపాటును, ఆవేదనయు వెలిపుచ్చినాఁడు.

అపు డా పెద్దమనుష్యుఁడు "మామా!-ఇందుకోసమని పాపము, నీవు పనికట్టుకొని బయలు దేఱితివా? ఈపాటి

దానికే యింతగా బ్రతిమాలుట యొకటా? శుక్రవారము నాఁటికి నేను వచ్చి, మీ యింటఁ గార్యము జయప్రదముగ జరిపించి, బిడ్డను దీవించెదనులే! ఇఁకెంతమాత్రము నీ వాతురపడకు. వెనుకకు మరలి, ఇల్లు చేరుకొని, యీ కార్యమునకు కగత్యమగు సరంజామంతయు సమకూర్చుకొను"మని ధైర్యము చెప్పినాఁడు.

నిస్పృహతో క్రుంగిపోయియున్న లాజరసున మాటలు చెవినిబడగనే సగము ప్రాణములు లేచివచ్చినవి.

"మహాత్మా!—మీ రెవరో సామాన్యులు కారు. లోకములో నెక్కడఁ జూచినను 'ఇది కలికాలము. ధర్మము నశించినది' అని జనులు తఱచు వాపోవుచుందురు. కాని, దయాస్వరూపులగు తమ దర్శనభాగ్యము కలిగిన క్షణమందే ఈ మాట సరికాదని నేను నిశ్చయించుకొంటిని. వెదకి పట్టవలెననెడి తీవ్రకాంక్ష యున్నచో, ప్రాప్తమనునది కలసి వచ్చినచో, మీవంటి దివ్యపురుషుల సందర్శనము లభించి తీరుననుటకిదే ప్రబలమగు తార్కాణ. మీ ధర్మమా యని మాట దక్కించితిరి. మనసునఁ గలిగిన సంతోషమును మాటలతో వెల్లడించ లేకున్నాఁడను" అనినాఁడు లాజరసు.

ఇంతవఱకు బాగుగనే యున్నది. ఇంటియొద్ద నతఁడు బయలుదేఱిన వేళావిశేష మెట్టిదోగాని తలవని తలంపుగ సగము పని సవ్యముగ తీరినది. ఐనను, ఇంక నెద్దియో యొక తాపత్రయముతో లాజరసు మనస్సు ఆందోళితమైయున్నటులు

ముఖవిన్యాసములఁబట్టి గ్రహించి, యా తగుమనుష్యుఁడు మరల నతనిని ప్రశ్నించినాఁడు.

అందులకు లాజరసు "శుభోదయా!—నా పూర్వ పుణ్యముకొలఁది మీరు దేవపితగా దొరకితిరి. మఱి మీ కనుగుణమైన దేవమాతను వెదకి తీసికొనిరావలెనుగద! అటువంటి లక్షణములు గల స్త్రీ ఏ తెఱచాటున నున్నదా యని ఆలోచనలో పడినాను. ఇదే నా యారాటమునకుఁ గల హేతువు" అని మనసు విడిచిచెప్పినాఁడు.

దీనిని వినిన పెద్దమనుష్యుఁడు "మామా!-ఇందును గుఱించికూడ నీవు బెంగపెట్టుకొన నక్కఱలేదు. అదిగో, పడమటి దిక్కున నగపడు ఆపట్టణమునకు వెళ్లుము. ఆ పట్టణము మధ్యమున నొక మండపముండును. మండపమునకు దగ్గఱనే యొక రాతిభవన ముండును. ఆ భవనములో వందలకొలఁది గదులు! ఒక్కొక్కగదిలో నొక్కొక్క దుకాణము కాని పించును. అనఁగా నిదియంతయు నొక గొప్ప బజారన్నమాట! రోడ్డువెంబడి నీవు పోవునపుడు నీ కుడిచేతివైపునుండి కొట్లు లెక్కపెట్టుకొనుచు ముప్పదిరెండవ గదిగుమ్మమునొద్ద నిలువుము. ఈ భవన మంతటికిని యజమానుఁడైన కోటీశ్వరుఁడు ఆ కొట్టులోపల నివసించును. తలుపు తట్టి ఆయనను పిలిచి, 'అయ్యా, నేను ఇటువంటి కార్యావసరమున వచ్చియున్నాఁడను. మీ యమ్మాయిని దేవమాతగా మా యింటికి పంపితిరేని ఎంతయైన సంతసింతును' అనుచు సంగతి సందర్భములు

విప్పిచెప్పెదము. నీ కార్యము తప్పక నెఱవేఱును" అనుచు మఱల ధైర్యము చెప్పినాఁడు.

పెద్దమనుష్యుఁ డభయ మిచ్చెనేగాని, లాజరసునకు మాత్రము నిండు నెమ్మది కలుగలేదు. "మహానుభావా!- అనుభవజ్ఞులగు తమకుఁ దెలియని ధర్మమేమున్నది? మా యూరిలోనే, నన్ను పిన్ననాఁటినుండియు నెఱిఁగినవారే, నేను పేదనైన కారణమున నిరసించి 'మాకు తీఱిక లేదు పో పో' మ్మనిరి. లోకము పోకడ యటులుండఁగా, మఱక్క మొగ మెఱుఁగని ఒక శ్రీమంతుఁడు - అందునను కోటీశ్వరుఁడు, నావంటివానిని కన్నెత్తి చూచునా? అట్టివారి యెదుట నిలువఁబడుటకైన నాకు తాహతు కలదా!" యని లాజరసు దాఁపఱికము లేకుండ తన సంశయము విప్పిచెప్పెను.

అంత నా పెద్దమనుష్యుఁడు లాజరసుతో "మామా!- నుంతయైన నీ వటులు సంశయింపఁ బనిలేదు. భాగ్యవంతు లైనంతమాత్రమున నెల్లరును గర్వించి యుందురనుకొనుట కేవలము పొరపాటు. అయినను, తక్కు విషయములు నీకేల? నేఁ జెప్పినటులఁ జేయుము. నీ కుపకారము జరిగితీరును" అనినాఁడు.

ఆ తగుమనుష్యుఁడు చెప్పినచొప్పున లాజర సా పట్టణము ప్రవేశించి, దాని మధ్యమునఁగల మండపము దరి నున్న భవనము కనుగొన్నాఁడు. ఆ భవనమునకు కుడిచేతి వైపునుండి లెక్కపెట్టుకొనుచు వెళ్ళి ముప్పది రెండవ గది గుమ్మము నొద్ద నిలువఁబడి, తలుపుతట్టి పిలిచినాఁడు.

ఇంటియజమానుఁ డివతలకు వచ్చి, లాజరసును లోనికిఁ గొంపోయి, బహువిధముల నాదరించెను. లాజరసు తన చరిత్రయు, వచ్చిన పనియు విప్పిచెప్పఁగా, ఆయన అభిమాన పూరితములగు మాటలతో "నాయనా!-ఇదేపాటిపని! ఒక వేళ నీవు కోరునది మాటవరుసకు శ్రమకరమగునదే యను కొందము. నీవంటి సత్పురుషుఁడు స్వయముగ వచ్చి అడిగినప్పుడు కాదనుట కెవరికిమాత్రము మనసొప్పును? కనుక, నీ వెంత మాత్రము నీ విషయమున ప్రాధేయపడుట తగదు. మంచి వారి కా ప్రభువే తోడుపడి దారిచూపును. నీవుపోయి కార్యమున కవసరమగు సన్నాహము లన్నియుఁ జేసికొనుము. మా యమ్మాయి తప్పక వచ్చి, దేవమాతగా నుండి నామ కరణము జరిపించును," అని ధైర్యము చెప్పెను.

లాజరసు ఉప్పొంగిపోయెను. వర్తకుఁడు తన పట్లఁ జూపిన యాదరాభిమానములకుఁ గృతజ్ఞత తెలిపి, ఎనలేని సంతసముతోను, సంతృప్తితోను గృహమునకు మఱలెను.

శుక్రవారమునాఁటి యుషఃకాలమున సరిగా సుముహూర్తమునకు, వాగ్దానము చేసియున్న పెద్దమనుష్యుఁడును, వర్తకుని కొమార్తెయు వచ్చి దేవపిత, దేవమాతలుగా వారివారి స్థానములలోఁ గూర్చుండి, యథావిధిగా కార్యము జరిపించి, శిశువునకు 'దేవదాసు' అని నామకరణము చేసిరి. 'ఈబిడ్డఁడు సామాన్యుఁడు కాఁడు. వరప్రసాదమున పుట్టినవాఁడు. దైవాంశ కలవాఁడు; గనుకనే దేవదాసు అను పేరు పెట్టితిమి. ఇతఁడు మహిమాన్వితములగు లోకోపకారము లొనరించి,

గొప్ప ఖ్యాతిపొందును. కుటుంబము పేరు నిలువఁబెట్టు'ననుచు లాజరసుదంపతులకు వారు తమ యామోదమును తెల్పి, హృదయపూర్వకముగ బిడ్డను దీవించిపోయిరి.

దేవపితగా వచ్చిన యా పెద్దమనుష్యుఁడు 'మామా, మామా!' యనుచు నెంతో యాప్యాయముగ నెఱిఁగియున్న టుల పలుకరించుచు వచ్చెనేగాని, లాజరసున కాతఁడెవఁడో యేమో ఇంతవఱకు తెలియనే తెలియదు. కార్యము ముగిసిన వెంటనే ఆతఁడు వెళ్ళనే వెళ్ళినాఁడు. మఱల నెటులైన ఒకసారి కలిసికొని యాతని పుట్టుపూర్వోత్తరములు కనుఁగొందమని లాజర సెంతయో యత్నించెను. కాని, లాభము లేకపోయెను.

# 2. అన్వేషణ

లేక లేక పుట్టిన యేకైక పుత్రునిఁ జూచికొని లాజరసు దంపతులు మురిసిపోవసాగిరి. వారటులు మురిసిపోవుటలో విడ్డూర మేమున్నది? వరప్రసాదముగ జన్మించిన యా పిల్లవాఁడు తలిదండ్రులకే గాక ఊర నెల్లరకు మురిపెముఁ గొలుపుచుండెను. పసిమిమిసిమినే పోఁత పోసిరా యనునటులుండు నాతని పచ్చని శరీరచ్ఛాయ, ఛాయను మించిన

యవయవసౌష్ఠవము, వయస్సునకుఁ దగిన చెయిదములు చూడ నెవరికిమాత్రము ముచ్చటఁ గొలుపవు?

పెరిగి పెద్దవాఁడగుచున్నకొలఁది శరీరసౌందర్యము నసే గాక, గుప్తసౌరభము విరజిమ్మెడి సుగుణపుంజము వలనఁగూడ దేవదాసెల్లర నాకర్షించుచుండెడివాఁడు. దైవ మిచ్చిన పరిజ్ఞానము సంగతి యటులుండ, నిరంతరము కార్య దీక్షయం దాసక్తి చూపుట, వివేకమునకుఁ దోడు వినయ సంపత్తి కలిగియుండుట — ఇవి యతనిలో సహజముగ మూర్తీభవించిన ప్రసాదగుణములు! వీనివలననే దేవదాసు మిక్కిలి పిన్నవయస్సులోఁ గూడ రాణకెక్కి సాటివారిలో 'ఆహా' యనిపించు కొనుచుండెను.

"దేవదాసు—ఎంత చక్కని పేరు! పిల్లవాని జాతక మునుబట్టి చూచిన జ్యోతిష్కులవలె ఆ దేవపితయు దేవ మాతయు తమ నోటి వాక్యము సార్థకమగునట్టి తీరున నిట్టి నామకరణము చేసిరి!" అనుచు, లోకులు చెప్పుకొని యానందించువారు.

ఐదవ యేఁడు వచ్చినదే తడవుగ దేవదాసున కక్షరా భ్యాసము జరిగినది. బడిలో వేసినది మొదలతఁడు ఏ విష యమునయిన నొక్కతూరి విన్నంతమాత్రమున నతిసూక్ష్మ ముగ గ్రహించి యాకళించుకొనుచుండెను. అతని బుద్ధి నైశిత్యమునకు గురువులుసైత మబ్బురపడి, దేవదాసు నొక యెత్తుగను తక్కిన శిష్యగణమునంతటి నొక యెత్తుగను పరిగణించుచుండిరి. తోడి విద్యార్థులెల్లరు నైదేండ్లలోఁ

జదివిన చదువును దేవదా సాక్కు వత్సరములో ముగించి, గురువులయొద్ద సెలవు గైకొనినాఁడు.

ఇటు లింట పనిపాటులలోను, అటు బడిలోని చదువు సంధ్యలలోను చకచక మెఱసిపోవుచువచ్చిన దేవదాసున కిప్పుడు ప్రాజ్ఞత వచ్చినది. దేవదాసునుగుఱించి చెప్పవలసిన ముఖ్యవిషయ మొకటి కలదు. అతఁడు పుట్టిననాఁటినుండియు దైవమునుగుఱించి యెవరేమి చెప్పుకొన్నను చెవులు ఱిక్కించి వినుచుండువాఁడు. ఏండ్లు పైఁబడినకొలఁది యీ యాసక్తి మఱింత హెచ్చి యాతని దృష్టిని మతమువైపునకు మరల్చి క్రమముగ పారమార్థికచింతకు దారి తీసినది. అందు చేత, నతఁడు తాను పుట్టి పెరిఁగిన క్రైస్తవమతమునకు సంబంధించిన గూఢార్థములను సూక్ష్మదృష్టితోఁ బరిశీలింప సాఁగెను. వారి పండుగలను, పబ్బములను గుఱించిన యాంతర్యములను శ్రద్ధాభక్తులతోఁ దెలిసికొనఁ గడంగెను.

ఏప్రిలు మాసమున వచ్చెడి 'ఈస్టరు' క్రైస్తవులకు గొప్ప పర్వము! అందు ముఖ్యమగు శుక్రవారము తనకు నామకరణము జరిగిన రోజు! కాఁబట్టి దేవదాసున కది యెక్కుడుగ ప్రియముఁ గూర్చెడి దినము. ప్రాజ్ఞత వచ్చిన దేవదా సిటులే యొకయేఁడు ఈస్టరు సందర్భమున శుక్ర వారమునాఁ డుదయముననే తన జననీజనకుల కభివందనము లర్పించుట మొట్టమొదటి విధిగా గ్రహించెను. వందనము లందుకొని వారతనిని మనసార దీవించిరి.

అటుపిమ్మట దేవదాసు, తనకు నామకరణ మొనర్చిన దేవమాత యునికి యేడనో తలిదండ్రుల నడిగి వైనము దెలిసి కొనెను. వెంటనే బయలుదేఱి పోయి యామె నివసించు పట్టణము చేరుకొని, మండపము సమీపమున దివ్యభవనము లోని ముప్పది రెండవ గదిగుమ్మము తలుపు తట్టి పిలిచి, తనకు 'దేవమాత' యైన కోటీశు తనయకు "ఈస్టరభి వందనము" లర్పించెను. పెరిగి పెద్దవాఁడైన దేవదాసును జూచి యామె యెంతో ముచ్చటపడినది. ప్రేమతో నాతనిని చేరఁదీసికొని తల నిమిరి ముద్దిడికొని యనేకవిధముల నాదరించి, వెలలేని బండెఁడు కానుకలతోఁ గూడ దేవదాసును దీవించి పంపినది.

నిండు సంతసముతో నాతఁ డింటికి మరలి, "నాయనా! ఈ యేఁటి యీస్టరుపర్వ మింతవఱకును చక్కగ సవ్యముగ సాఁగిపోయినది. ఇఁక నొక్క పనిమాత్రము తరువాయి కలదు. అది గూ నెఱవేఱినచో పండుగ సార్థకమైనటులే! నాకు నామకరణమహోత్సవము జరిపించిన పుణ్యమూర్తి యగు నా దేవజనకుని దర్శించి, యభివందనము లర్పించి, యాతని యాశీర్వాదము పొందుటతో నా జన్మ పావనమైపోవు" ననుచు, దేవదాసు కుతూహల పడెను.

ఇందులకు లాజరసు "కుమారా!—నీ దేవజనకుని విషయమే నిజమునకు నా జీవితములో నొక తీరని సమస్యగా నిలిచియున్నది. ఆయన యెవరో యేమో, ఊరుకాని పేరు కాని నా కింతవఱకును తెలియనే తెలియదు! మన గ్రామ

మున నందఱును నా కోరికను త్రోసిపుచ్చి దేవజననిగ నుండుటకు నిరాకరించిన సమయములో, వీరిని నమ్ముకొని లాభములేదని తలఁచి పొరుగూరికిఁ బయనమైతిని. మార్గ మధ్యమున నా మహానుభావుఁ డెదురుపడి, తనంతతానే నన్ను పలుకరించి, హితునివలెను, సన్నిహితునివలెను నా కుశలము లారసి, "మామా!—ఇందుకోసమని పాపము, పనికట్టుకొని బయలుదేఱినావా? ఈపాటిదానికే యింతగ బ్రతిమాలుట యొకటా? శుక్రవారమునాఁటికి నేను వచ్చి, మీ యింటి కార్యము జయప్రదముగ జరిపించి బిడ్డని దీవించెదనులే. ఇఁకెంతమాత్రము నీ వాతురపడకుము. వెనుకకు మరలి, యిల్లు చేరుకొని, కార్యమున కగత్యమగు సరంజామంతయు సమకూర్చుకొను"మని ధైర్యము చెప్పినాఁడు. అంతియ కాదు. దేవమాతగా నుండుటకుఁ దగిన యోగ్యురాలగు నా కోటీశుతనయను గుఱించిన కీలకముఁగూడ నాతఁడే నాకుఁ దెలియఁజెప్పి, నా మనస్సులోని బెంగను అపనయించినాఁడు. మాటతప్పక మరుసటి శుక్రవారమునాఁటి యుషఃకాలముననే వచ్చి, నా కెంతో సాయపడి, నీ నామకరణమహోత్సవ మును వైభవముగ జరిపించెను. ఆ కార్యమైన తక్షణమే యాయన యెటు పోయెనో మఱి యింతవఱకు కంటి కగపడనే లేదాయె! ఇదే నా కిప్పటికిని ఆశ్చర్యకరముగ నున్నది. ఎటులైన నా మహానుభావునిఁ గనిపెట్టవలెనని చేయవలసిన యత్నములెల్ల చేసితిని. కాని యవన్నియు విఫలములే యైనవి. ఏమి చేయుటకును పాలుపోకున్నది..."అని సమా

ధానము చెప్పుచు, లాజరసు మఱియొకపరి యోచనాపరుఁ డయ్యెను.

ఈ వింతవార్త వినుసరికి దేవదాసు మనస్సులో ననేకములగు భావములు పఱుగులెత్త నారంభించినవి. "తండ్రీ!- మీరు చెప్పిన మాటలనుబట్టి యాయన యెవ్వఁడో యవతార పురుషుఁడై యుండవలెనుగాని, సామాన్యమానవుఁడని నాకుఁ దోఁచుటలేదు. తన్ను నమ్ముకొనియున్న యాశ్రితుల నాదరించి ప్రోచుటకే ప్రభువిట్టి దేవదూతలను భూలోకము నకుఁ బంపుచుండును. వచ్చిన పని పూర్తియైనచో, క్షణము సేపయిన వారిచ్చట నిలువరు. నా దేవజనకుఁడుకూడ నట్టి దేవగణమునకుఁ జెందిన దివ్యపురుషుఁడే యయియుండ నోపును. ఎటులైన నా మహానుభావుని వెదకిపట్టి, యాతని దర్శనము చేసికొని, నా యభివందనము లర్పించి యాతని యాశీస్సులు పొంది తీరవలెను. జీవితములో ముఖ్యమగు నీ చిన్నవిధిని నెఱవేర్చుకొనలేక పోయినచో, ఈ వెలితి కల కాలము నిలిచిపోవును. మనస్సునకుత్సాహముండదు. కనుక, పోయివచ్చెదను. అనుమతి దయసేయుఁ"డనుచు దేవదాసు తండ్రిని కోరినాఁడు.

అతఁడిటులు కోరుటతో, లాజరసు దంపతులకు మఱల నొక సమస్య యేర్పడినది. ఆ దేవపిత యెక్కడ నుండునది లాజరసునకే తెలియకపోయెనే! లాజరసువంటి యనుభవజ్ఞుఁడే సకలయత్నములు చేయ సాధ్యముకానప్పుడు-ఇఁక ముక్కుపచ్చలాఱని యీ కసుఁగందువలన నగునా? ఈ

విశాలప్రపంచమున నే దెసకుఁ బోవుట? పర్యటనములోఁ గల కష్టనిష్ఠురముల నీతఁ డెట్లు తట్టుకొనుట?—ఇవ్విధమగు ప్రశ్నలనేకములు-పుత్రునిపై మమత గల లాజరసు మనస్సున నుప్పతిలుచుండెను.

కాఁగా, బాలుని వచనములెల్ల బ్రహ్మవాక్యముల వలెఁ గన్పట్టుచున్నవే? దేవదాసుని యూహలు వయస్సునకు మించినవి! ఆతని మాటలు తిరుగులేనివి. అందుచే 'వినఁదగు నెవ్వరు చెప్పిన' యను పెద్దల సుద్ది ననుసరించి, కొమరుని మాటలను లాజరసు కొంకెంతలుగ నెంచిచూచెను. చూడంగ జూడ, నా మాటలెల్ల నత్యంత సమంజసములుగఁ దోఁచినవి. కావలెనన్నను కాదనుట కతనికి వీలులేకపోయినది.

ఏమైననేమి, చివరకు తన బుద్ధిచాతుర్యమువలన దేవదాసు తలిదండ్రులకు నచ్చఁజెప్పి, యొప్పించఁగల్గినాఁడు. మనసార వారు 'నాయనా, పోయి ర!'మ్మనిరి. దేవదాసు బయలుదేఱినాఁడు.

# 3. ఉనికిపట్టు

ఇల్లు విడిచి బయలువెడలిన దేవదాసునకొక విశాలమగు బాట కనఁబడగా,—అదే రాజమార్గమై యుండుననుతలంపుతో దానింబట్టి పోవసాఁగెను. నిజమున కతఁడనుసరించి నడుచుచున్న బాట సరియైనదే.

అతఁడటులు తదేకదీక్షతో పోవఁగా పోవఁగా, లాజరసునకుఁ గనఁబడినట్టుగనే దేవదాసునకుఁగూడ, మున్నెన్నఁడు పరిచయము లేని యొక పెద్దమనుష్యుఁ డెదురై, "అబ్బాయీ! నీ దేయూరు? నీ పేరేమి? ముఖలక్షణములను బట్టిచూడ మంచిపిల్లవాఁడవుగఁ గనఁబడుచున్నావే! నీవలన లోకమునకు గొప్ప యుపకారమెదో జరుగవలసి యున్నటులుకూడ నా మనస్సునకుఁ దట్టుచున్నయది" అని పలుకరించినాఁడు.

దానికి బదులుగా దేవదాసు వినమ్రుఁడై యాయనకు నమస్కరించి: 'అయ్యా! మీ రింతటి యాదరాభిమానములతో నన్ను పలుకరించుట నా కెంతయు నానందముగనున్నది. మీకుఁ గృతజ్ఞుఁడను. పూజనీయమగు మీ రూపము చూచినంతనే నా హృదయమున నొక వింతవెలుఁగు వెలిఁగినట్టు గోచరించుచున్నది. ఈ పర్వాసమయమందు తమవంటి మహానుభావుల సందర్శనము లభించుట నా పూర్వపుణ్యవిశేషము గాక మరేమి! ఏదో పనిమీఁద వెళ్లుచున్నటు

లున్నారు. ఒక్క నిమిషము వ్యవధి కలదేని నన్నుగుఱించి రెండే రెండు మాటలు చెప్పుకొందమని ఉవ్విళులూరు చున్నా' ననెను.

'తప్పక చెప్పవోయి నాతండ్రీ! నీవంటి సుచరితుని గుఱించి తెలిసికొనుటకంటె గొప్పపని యేమున్నది? నీచరిత్ర వినుటకు నా మనస్సు మిక్కిలి యారాటపడుచున్నది' అనుచు నా పెద్దమనుష్యుఁడు ప్రోత్సహింప, దేవదాసు ఇట్టుల పలికెను :

''తండ్రివంటివారు తమరు! నాయెడల నపారమైన వాత్సల్యముంచి యవకాశమిచ్చినప్పుడు మనస్సులోని మాట దాఁచుకొనలేను. క్రైస్తవులకు ముఖ్యమైన యీ యీస్టరు మహాపర్వమున నావంటి పిన్నవాఁడు నెఱవేర్పవలసిన విధు లలో మొదటిది యాత్మీయుల దీవన లందుకొనుట. కావున నుషఃకాలముననే తొలుత, నన్ను కని పెంచిన జననీ జనకు లకు యథావిధిగ నభివందనము లర్పింప, వారు ప్రేమతో నన్నాశీర్వదించిరి. తరువాత—మా యూరిదగ్గఱి పట్టణముననే నా 'దేవమాత' యుండెడి తావునకు, మాతండ్రిగారు చెప్పిన గురుతులఁ బట్టి పోయి, యామె కభివందనము లర్పించి, ఆమెవలనకూడ చల్లని దీవనలు పొందివచ్చితిని. సరి, బాగు గనె యున్న దింతవఱకు. ''మఱి నా 'దేవపిత' యెక్కడ? వారి యునికి తెల్పిన నచటికిఁగూడ బోయి యాయన యాశీ స్సులు అందుకొని వచ్చెద''నని నాయనగారి నడిగితిని. అందు లకు వారొక పెద్దగాథ చెప్పుకొనివచ్చి' రనుచు, తండ్రి

చెప్పిన వివరణము లన్నియు నా పెద్దమనుష్యునకు పూస గ్రుచ్చినట్లు వినికిడి చేసెను.

"నా దేవపిత యెటులుండునో, వారి ముక్కు మొగ మెఱుఁగను. ఏమైననుసరే, ఈ పర్వసమయమున నాయన కభివందనములర్పించి వారి దీవనలు పొందినఁగాని యీ వెలితి జీవితాంతమువఱకు నుండిపోవునుగదా! కావున నెట్టి శ్రమలకు లోనైన సరే, నా దేవపితను నేఁడు వెదకిపట్టి, వారి దర్శనము చేసితీరవలెనను నిశ్చయముతో ప్రభువుపైన భారమువేసి బయలుదేఱినాను. అదృష్ట మెటులున్నదో!" అనుచు తన సంకల్పమును వెల్లడించెను.

ఈ మాటలు వినినతోడనే యా పెద్దమనుష్యుఁడు నిండుప్రేమతో బాలునిఁ జేరఁదీసికొని, "నాయనా!—నిజముగ నీ వదృష్టవంతుఁడవే! నీవు తలఁచెడి తలఁపులు, చేసెడి చేఁతలు, నడచెడి తీరులు-అన్నియు సరియైనవే. ధర్మమెఱింగిన నీవంటి బుద్ధిమంతుని, గుణవంతుని దయామయుఁడైన యా దేవదేవుఁడు సదా కనిపెట్టుచునేయుండును. నీ వెవ్వరికొఱకై ఆత్రముతో వెదకుచున్నావో, ఆ నీ దేవపితను నేనే!! నీకు 'దేవదాసు' అను పేరుపెట్టినదికూడ నేనే. ఈనాఁటికి, పెరిఁగి పెద్దయగుచున్న నిన్నుఁజూడ నెంతో సంతోషమగుచున్న' దనినాఁడు.

తాను ప్రసంగించుచున్న యా పెద్దమనుష్యుఁడే తన దేవపిత యని తెలియఁగానే, దేవదాసు మానస ముప్పొంగిపోయినది. భగవంతుని లీలల కతఁడు తన్మయుఁడైనాఁడు.

మతాచారము ప్రకారము 'ఈస్టరు - అభివందనము' లర్పిం చుటకని దేవదాసు తన దేవపిత హస్తమును ముమ్మాఱు ముద్దిడుకొని, యాయన దీవెన లందుకొనినాఁడు. 'ఆహా, ఎంత సుదినము! ఎంత సుదినము!!-ఇప్పటికిఁగద నా యభీప్సిత మీడేఱినది! పర్వము సార్థకమైనది!' అని మనమున తలఁచి తలఁచి, బాలుఁ డుత్సాహి యగుచుండెను. ఏ క్షణమునందు దేవపిత తన్ను చేరఁదీసికొనెనో-ఆక్షణమే దేవదాసు హృదయ మున నొక వింతయైన క్రొత్తవెలుఁగు ప్రవేశించి, యాతనిలో నుండెడి జ్ఞాన తేజమును విజృంభింపఁజేయుచుండెను. ఈ మార్పు నా బాలుఁ డనుభవింపఁ గల్గుచుండెనుగాని, ఇదమిత్థ మని విప్పి చెప్ప లేకుండెను.

తదుపరి దేవదాసు వినయవిధేయత లుప్పతిల్ల రెండు చేతులు జోడించి, 'తండ్రీ!—ఇంటికిఁ బోవుదము దయ చేయుఁడు. మా నాయనగారు తమ దర్శనమునకై యెంతగ తపించిపోవుచున్నారో చెప్పనలవికాదు'' అనుచు నాహ్వా నించెను.

బాలుని భక్తితాత్పర్యములకు దేవపిత యచ్చెరువంది, ''కుమారా!-ఇప్పుడే నీ వెంబడి నేను రాఁజాలకున్నాను. ఇందులకు నిరుత్సాహపడఁబనిలేదు. నిరంతరము నేను లోక సంచారము చేయవలసినవాఁడను. ఇపు డత్యంతావశ్యకము లగు పనులున్నవి. తిరిగి తిరిగి రేపటి యుదయమున కిల్లు చేరుకొనఁగలను. నీవు బసకు వచ్చినట్టయిన నన్ను కలిసికొన వచ్చు' ననుచు చెప్పినాఁడు.

"ఎంత యదృష్టము నాయనగారూ!—మీ యునికి తెలిసెనేని, తఱచు మీ దర్శనభాగ్యము కలుగుచుండునే. మహాత్ముల సందర్శనమొకటి జీవితమున కానందము!" అని గాఢామోదము తెల్పుచు, ఆయన యుండెడి బసకు గుర్తులు చెప్పవలెనని కోరినాఁడు బాలుఁడు.

అందులకు దేవపిత "ఇక్కడినుండి సరాసరి తూర్పు దెస పోయినచో నొక పెద్ద యడవి యగపడును. ఆ యడవి దాఁటినవెంటనే యొక మైదానము కనఁబడును. అడవి దాటు సరికి నీ యొడలికి బడలిక కలుగును. అందుచేత, మైదానములోఁ బండుకొని యొకింత విశ్రాంతి తీసికొనవచ్చును. నీవు పండుకొనియున్న సమయమున నప్రమత్తుఁడవై, చుట్టు పలుమూలల నేమి వింతలు జరుగునో పరికింపుము. పిమ్మట మఱల బయనమై సాగిపోతివేని యొక యారామము, ఆరామములో బంగరుమలామా చేసి తళతళ మెఱసెడి యొక దివ్యభవనము కనుఁగొనఁగలవు. ఆ భవనమే నా యునికి. రేపటి దినమున నీవు వచ్చెడివేళకు, నీకొఱకు నేను గుమ్మము కడనే యెదురుచూచుచుందును. నీకు మేలగును, పోయి రమ్ము!" అని చెప్పి, దేవపిత యంతర్హితుఁడైనాఁడు.

# 4. ఎలుఁగుల యొగసిపాటు

మఱునాఁడు దేవదాసు, సరిగా దేవపిత చెప్పినట్టుగనే బయలుదేఱినాఁడు. తిన్నగా తూర్పుదిక్కునకు వెళ్లుసరి కొక యరణ్యము తగిలినది. అడవి దాఁటిన వెంటనే మైదాన మగపడినది. మైదానము చేరుకొనుసరికి, దేవపిత చెప్పినటులే యించుక బడలిక యారంభమైనది. కావున, దేవదా సొక చెట్టుక్రింద పండుకొని విశ్రాంతిఁ గైకొనఁ గడంగెను.

ఆ సమయమున నతనికి కొన్ని చిత్రసంఘటనములు కానవచ్చినవి :

బ్రహ్మాండమగు నొక వటవృక్షము ; దాని కొమ్మకు త్రాడు కట్టఁబడియున్నది. అది యొక బరువుపాటి కొయ్య దుక్క కూఁతగ నిలిచియున్నది. ఆ దుక్కకు చేరువనే యొక కఱ్ఱతొట్టి ; ఆ తొట్టినిండుగ మధువు !

బడలిక తీరుటకై దేవదాసు మేను వాల్చెనే గాని, యతని మెదడు పనిచేయుచునేయున్నది. 'జనసంచారము లేని యీ మైదానములో భారమగు దుక్కయేమి ? దుక్కకు చేరువగ నీతొట్టియేమి ? తొట్టినిండుగ తేనెయేమి ? పనిగట్టు కొని యివ్విధమున వీని నెవరిక్కడ నమర్చిరి ? ఎందుకోసమని యిటు లమర్చిరి ?' అనుచు నతఁడు తనలోఁదా నాశ్చర్య ముతోఁ బ్రశ్నించుకొనసాగెను.

ఇంకను దీనినిగుఱించి దేవదా సాలోచించునంతలో కొన్ని యెలుఁగు లెలుఁగెత్తి యఱచుచు, నతఁడు పండుకొని యున్న చెట్టుదెసకు పరుగెత్తుకొని వచ్చినవి. అందొకటి తల్లియెలుఁగు. తక్కినవి దాని పిల్లలు. పిల్లలలో నొకదాని కేఁడాది వయసు. మిగిలిన మూఁడును పాలు ద్రావెడి పసికూనలు.

మొదట, తల్లియెలుఁగు బుసలుకొట్టుచు తిన్నఁగ తొట్టియొద్దకు పోయినది. తల్లివెంబడి పిల్లలును వెళ్లినవి. తన పొడవాటి ముట్టెను తొట్టిలో ముంచి, తల్లి మధువు జుఱ్ఱుకొన్నది. 'మీరుకూడ జుఱ్ఱుకొనుఁడు' అని పిల్లలకును చెప్పినది. తల్లి చెప్పుటయే తడవుగ పిల్లలు నెగసివచ్చి, తల్లివలెనే తేనె త్రాగ నారంభించినవి.

అంతలో - కడుపునిండుగ తాము తేనె దట్టించుటకు అడ్డువచ్చెడి యా బరువైన కొయ్యదుక్కను తల్లియెలుఁగు తలతోఁ బైకి నెట్టినది. నెట్టిన వెంటనే దుంగ పైకి పోయినది. పోయిన దనుకొన్న దుక్క మఱల నూఁగికొనుచుఁ గ్రిందికి దిగివచ్చినది. సరిగా నా సమయముననే పిల్ల యెలుఁగులు ముట్టెలు ముంచి మధువు పీల్చుచుండినవి. అందువలన, క్రిందికి వచ్చిన యా దుంగ పిల్లయెలుఁగుల నొక్కత్రోపు త్రోసినది.

తన బిడ్డలను త్రోయుట చూచి తల్లి యెలుఁగునకు విపరీతపుఁ గోపము కలిగినది. 'నోరు లేని కట్టెముక్క కింత

పోగరా!' యనుచు, నీసారి యావేశమున దుంగను కాలితో మఱింత దూరము గెంటివైచినది.

ఇటులు తల్లియెలుఁగు చేసిన దూషణకు నోరులేని కొయ్యదుక్క సైతము కోపగించినది. అది యింకను పైకి పోయి, మఱింత వేగముతో దిగువకు మరలివచ్చినది. అది వడివడిగ వచ్చుటచే దిగువనున్న కూనలలో నొకదానికి వీఁపుమీఁదను, మఱియొకదానికి నెత్తిపైని దుక్క చఱపులు తగిలినవి. బాధ భరింపలేక యా కూనలు 'కుయ్యో, మొఱ్ఱో!' యనుచు పరుగులెత్తినవి.

తన బిడ్డలు బాధపడుటను తల్లి సహింపలేకపోయినది. దయాదాక్షిణ్యములు లేని యా దుర్మార్గపు దుంగను, పౌరుషము మెఱయ ముందుకాళ్లతో గట్టిగఁబట్టినది. తలపైకెత్తినది. తీవ్రమగు నొక్క విసరు విసరి భల్లూకపుపట్టు అన నిది సుమా యని చవిచూపినది.

ఆ విసరుతో నెంతో యెత్తునకు పోయిన దుక్క గాలిపటమువలె విహరింపఁజొచ్చినది. 'సరి, ఈ కొయ్యకు బుద్ధివచ్చినది, ఇఁక క్రిందికి దిగిరాదులే' యని తలఁచి, పిల్ల యెలుఁగులు స్వస్థత చెందినవి. వానిలో యేఁడాదికూన మఱల తొట్టికిఁ జొఱఁబడి, లొడలొడ మనుచు మధువుఁ గ్రోలసాఁగినది. అది పీల్చుట చూచి, తక్కిన పిల్లలును మెల్లఁగ దాని దరిచేరినవి.

'ఒకసారి శాస్తి జరిగినప్పటికి, గర్వించిన యీ యెలుఁగు కూనల కప్పటికప్పుడే పరగడు పయినదే! ఉండుము. నా

దెబ్బ కొట్టెదో వీనికి జ్ఞప్తికిఁ దెచ్చెద' ననుకొన్నది కొయ్య
దుక్క. అది, తన్ను తల్లి యెలుఁగు విసరుతో ఎత్తివేయుటను
విస్మరింపలేదు. ఆ మాట కడుపులో నుంచుకొని, కసిపూనియే
యున్నది. ఎప్పుడు దెబ్బతీసి బదులు తీర్చెదనా యని యిట్లు
కనిపెట్టుకొనియున్న యీ ప్రాణి ముద్దు—తల్లి తన్నెంతటి
విసరుతోఁ గొట్టెనో, అంతకు మించిన వేగముతో నెగిరిపడుచు
దిగివచ్చి, మధువు పీల్చెడి వేఁడాదికూనను నెత్తికొట్టి నేలపైఁ
బడవైచినది.

దుక్క చేసెడి యీ యాగడము చూడ తల్లి యెలుఁ
గున కావేశమెత్తినది. గొంతు పగులునట్లు లొక్క బొబ్బ
పెట్టినది. శక్తియంతయు నుబికించుకొని, బద్ధవైరమున, నా
దుక్క నాకసమున కంటునట్లు విసరివైచినది.

ఈ విసరుతోఁ గొయ్యదుక్క, తాను కట్టఁబడియున్న
చెట్టుకొమ్మను సయితము మించి, ఎత్తునకు పోయినది!
దుక్క యంత యెత్తున కెగురుసరికి, దాని ధాటి కాఁగలేక,
దానికి కట్టిన మోకు సడలినది.

ఇప్పుడు దుక్కకు పూర్తిగా నాగ్రహము వచ్చినది.
'కానిమ్ము. ఇఁక నీ యెలుఁగుల నెంతమాత్రము క్షమింపను.
ఇంతటితో వీని పొగరణఁచివేసెద'నని నిశ్చయించినది. అది
గగనమార్గమున నెగిరియెగిరి, విశ్రాంతికొఱకో యనునట్లొక్క
పరి అట్టె కదలక నిలువఁబడినది దుక్క యెప్పుడు దిగి
వచ్చునా, ఎప్పుడు దాని పనిపట్టి పగతీర్చుకొందుమా యని
తల్లియెలుఁగు తొట్టియొద్దనే కనిపెట్టుకొని యుండినది.

శత్రువు నోడించవలెనని సిద్ధపడియున్న కొయ్యదుక్క యిప్పుడు దృష్టిని క్రిందికి మరల్చి, తిరుగుముఖము పట్టినది. క్రిందికి దిగుచున్నకొలఁది, కొయ్యకు కోపము, తాపము, ఉద్రేకము నెక్కువైనవి. గిరగిర చుట్టులు తిరుగుచు, పందెపు గొఱ్ఱెవలె నెగసివచ్చి, తల్లిమెలుఁగు తలను చితుకవేసినది!

తనువునకు ముఖ్యమయిన తలయే చితికిన తరువాత నిఁక చేయునదేమున్నది? పాపము! తల్లిమెలుఁగు చుట్టిచుట్టి దొరలుచు, గిలగిల తన్నుకొనుచు నేలనుగూలినది.

రోషము, పంతము ప్రధానముగాఁగల యవివేకి, యా తల్లిమెలుఁగునకు పట్టిన యవస్థ చూచి దాని కూనలు కిమ్మనక యడవిలోనికి తరలిపోయినవి.

# 5. దేవపిత హితవు

చెట్టుక్రిందఁ బరుండియున్న దేవదా సెలుఁగుల చేష్టలను తిలకించి, యిటుల తలఁచినాఁడు :

"విశ్రాంతి తీసికొను సమయమున నప్రమత్తుఁడవై, చుట్టు నలుమూలలఁ జూచి, యేమి చర్యలు జరుగునో పరికింపుము' అనికదా దేవపిత నాతోఁ జెప్పెను? ఆయన

చెప్పిన చర్యలు బహుశః యీ యెలుఁగులను గుఱించియే యయియుండనోపును. స్పష్టముగ విప్పిచెప్పకపోయినను, ఇదే వారి యుద్దేశమై యుండునని నా మనస్సునకు రూఢిగఁ దోఁచుచున్నయది.'

'నా దేవపితవంటి జ్ఞానులెట్టి చిన్నిమాట చెప్పినప్పటి కిని, ఆ మాటలోని విలువను గ్రహించి, దాని భావమును నెమ్మదిగ నర్థము చేసికొనవలెను. అదియ ప్రాజ్ఞుని లక్ష ణము. 'ఏమి యీవ్యక్తి! సందర్భము, సమన్వయము లేకుండ సగముసగముగ మాటాడునే?' యని చీఁదఱించుకొనరాదు.

'అసలు, పెద్దల మాటల తీరే యది! ఒకానొక విషయ మును సూచనగ నందిత్తురు. అది మనమెంతవఱకు వగా హన చేసికొనఁగలమో చూతురు. మన బుద్ధిబలమును పరీక్షించినపిమ్మట అర్హత కలదేని, వారే మనలను పైమెట్టు నకు నెట్టుదురు. ఇదే మంచి గురువులకు నైజము.

'ఇదంతయు నాలోచింపఁగా 'వింతలు చూడు'మని నా దేవపిత చెప్పిన చిన్నిమాటలలో నెంతటి నిగూఢ భావము లున్నవో, యెలుఁగుల చిత్రము చూచిన నా కిప్పుడు క్రమముగ నవగతమగుచున్నది.

'అంతేకాదు. 'ఈ చిత్రము చూడుము' అని యాయన యనుటలో ఊరక వినోదార్థము పైపైని చూచుట కాదనియు, ఆ యెలుఁగుల చేష్టలను సూక్ష్మదృష్టితోఁ గనిపెట్టి, జ్ఞాననేత్రముతోఁ బరికింపవలెననియు, తత్ఫలితముగ జీవితమునకు సమన్వయించుకొనఁదగు నంతరార్థమేదియో

యున్నదనియు, అందు మానవులు నేర్చుకొనవలసిన గొప్ప పాఠమేదో యుండుననియు, నిప్పుడిప్పుడు నా మనస్సునకు స్ఫురించుచున్నది'' అనుచు నీవిధముగ, కంటఁబడిన వింతలను గుఱించి దేవదాసు తనలోఁ దానే వితర్కించుకొనుచు, లేచి, మఱల బయనము సాఁగించినాఁడు.

కొంత దూరము పోఁగా నొక తోఁట; తోఁటలో దేవపిత చెప్పినయటులే బంగారు కప్పుగల భవన మాతనికిఁ గన్పించినది. ఆ భవనద్వారముకడనే దేవపిత మందహాసముతో దేవదాసుకొఱకు వేచియున్నాఁడు.

''వచ్చితివా నాయనా!—నీవు మాటతప్పక నడుచుకొన్నందుల కెంతయు సంతసించుచున్నాను. రా, ఇటురమ్ము'' అనుచు దేవపిత దేవదాసును లోనికిఁ గొంపోయెను. కొనిపోయి, లోనున్న తోఁటలు, దొడ్లు, పుష్పవాటికలు, తదితరములగు మనోహర ప్రదేశములు మున్నగునవియెల్ల వరుసగఁ జూపించెను.

''నాయనా!-ఇట్టి దృశ్యములు నీ వింతకుముం దెన్నఁడైనఁ జూచియెఱుఁగుదువా?—పసివాఁడవు. చూచుటకుఁ జాలినంత వయస్సేదీ నీకు!'' అనినాఁడు దేవపిత.

అటుతరువాత, వారిరువురును అందాలుచిందెడి యా దివ్యభవనములోని గదులన్నియు నొక్కటొకటిగఁ జూచుకొనుచుఁ బోయిరి. దేవదాసున కాగదు లొకదానిని మించి మఱియొకటి యున్నటులఁ గన్పట్టినవి. ఇఁక-ఆ గదుల సౌంద-

ర్యము, చక్కని యా యేర్పాటులు నోటిమాటలతోఁ జెప్ప నలవి గాకున్నది.

అన్నియు నైనపిమ్మట, చిట్టచివరకు మారుమూల నుండెడి యొక చిన్నగది చేరుకొన్నారు వారు. అది చిన్న గదియే యైనను, తక్కినవాని మోస్తరుగ తెఱచుకొని యుండక, మూసి ముద్ర వేసియున్నది. 'కుమారా!-ఈ భవన మంతయు నొక యెత్తు, ఈ చిన్నిగది యొక్కటియు నొక యెత్తు' అని దేవపిత చెప్పినాఁడు.

'నాయనా!—బ్రహ్మాండమగు నీ యాకాశమును జూడుము. అది మనపైని పడకుండ నెవ్వరయినఁ బట్టుకొనిరా? లేదు. దానంతట అదే నీతికి నిలిచియున్నది. అటులే, 'ముద్ర' ఒక నైతికముద్ర. ఇప్పుడీ చిన్నిగది కటువంటిదే యొక ముద్ర యున్నది కాని తలుపులు లేవు, తాళములు లేవు. 'ఈ గదిని తెఱువవలదు' అను మాటను సూచించునదే యీ ముద్ర! నీతిని పాటించి మనమీ ముద్రను కాపాడవలసినదే కాని, దానిని విడఁగొట్టి లోనఁ బ్రవేశింప వలెనని నిమిషము పట్టదు.

'పిన్నవాఁడా!--నేఁ జెప్పునది జాగ్రత్తగ వినుము: ఈ భవనము నీ యధీనము చేయుచున్నాను. గదులన్నిట నీవు విహరింపవచ్చును. తోఁటలు, దొడ్లు తిరుగులాడవచ్చును. ఉద్యానములు, పరిసర ప్రదేశములు ఇచ్చవచ్చినటులు చుట్టి రావచ్చు. దృశ్యములెల్ల చూచి యానందింపుము. హాయిగఁ గాలక్షేపము చేయుము. నీవు చేయరాని పని ఒక్కటే

ఉన్నది: పొరపాటుననైన నెన్నఁడును, ముద్రవేసిన యీ చిన్నిగదిని మాత్రము తెఱువకుము.

'చిన్నారీ!—ఈ గదినిమాత్ర మెన్నఁడును తెఱువఁబోకుము. తెలిసినదా? నే నెదుట లేనప్పుడు నీ మనస్సు మాఱిపోవచ్చును. 'ఆఁ – ఇందులో నేమున్నది? ఇదియుఁ దక్కిన గదులవంటిదేకదా! ఇక్కడ నెవ్వరును లేరే, తీసి చూచిన నేమిపోయె!!' నని బుద్ధిపుట్టుట మానవునకు నైజము. అట్టిది ప్రళయాంతకమగు చెడుబుద్ధి యని తలఁపుము. ఎన్నఁడైన నిటువంటి పొరపాటుతలంపు మనస్సునకుఁ గలిగినయెడల, ఆనాఁ డడవిలో నీవు చూచిన వింతదృశ్యముల నొక్కపరి జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. తెచ్చుకొనుట చాలదు. వానిని నీ జీవితానుభవములతో సమన్వయించి చూచుకొనుము. నాయనా!–ఇదే నేఁ జెప్పఁదలఁచిన మాట' యనుచు, దేవపిత మఱి కనఁబడకుండ మాయమైనాఁడు.

# 6. పరిశీలన

ఇపు డీ దివ్యభవనమునందు దేవదాసునకు కాలక్షేపము బాగుగనె జరుగుచున్నది. కనులపండు వొనర్చెడి ప్రకృతి దృశ్యములు, వీనుల విందొనరించెడి పక్షుల కలకలా రావ

ములు ! జీవితమున కింతకు మించి కావలసిన దేమి ? ఇట్టి చక్కని వాతావరణమునందు విసువు విరామము లేకుండ ఎంత కాలమైనను గడపవచ్చును. అటులే దేవదాసు నిండు ముప్పది వర్షములా భవనమునందు గడపినాఁడు.

పైకిఁ గానఁబడు పరిస్థితులు దేవదాసునకు హాయి గొల్పుచున్నవనియు, అతని కెట్టి లోపము లేదనియు మన మనుకొందుము. కాని, ఎన్ని యున్నప్పటికి, ఆ భవనములోఁ బ్రవేశించినప్పటినుండియు దేవదాసు మనస్సున నేదో చెప్ప లేని జిజ్ఞాస రేఁగుచు నేయుండెను.

దేవపిత యనిన నతని కపారమగు భక్తిగౌరవములు కలవు. ఆయన యాజ్ఞను గురుపదముగ నెఱవేఱుపవలెననెడి పట్టుదలయుఁ గలదు. ఐననేమి ?—'వలదు' అనుదానివంక నే మానవుని మనస్సు మ్రొగ్గుచుండును. లేకున్న, దేవపిత యా ముద్రవైచిన గదినిగురించి యంతగ హెచ్చరించినేల పోయెనే? తెలిసియు, తన స్వభావమును దేవదాసేల మార్చుకొనలేడు?

అనుభవించి యానందించుటకు చక్కని తోఁట లున్నవి; దొడ్లున్నవి, దివ్యభవనమున్నది. ఇన్నియున్నను, ఎట్టి కొదువయు లేకున్నను, 'తెఱువవలదు' అని దేవపిత చెప్పిపోయిన యా మాఱుమూల మూయఁబడిన గదిమీఁదనే యేల దేవదాసు మనస్సు లగ్నమైయుండవలెను? దేవపిత యదృశ్యమైన క్షణమునుండియు దేవదాసు మనస్సా చిన్ని గదిలో నేమున్నదో యను సమస్యతోనే వేఁగిపోవుచుండెను.

దేవపితమాటయందుఁ గల గౌరవముచే నైననేమి, "పొరపాటున చెడ్డతలం పెన్నఁడైన కలిగినచో ఆనాఁడడవిలోఁ జూచిన దృశ్యములు జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్మ'ని ఆయన హెచ్చరిక చేసిన ఫలితముగ మనస్సులోఁ గలిగెడి జంకువలన నైననేమి, తన మనోబలమువలన నైననేమి, ముద్రగదిని తెఱువక దేవదాసు నిండు ముప్పది వర్షములు గడుపఁజాలెను. అతనికిఁ గల్గిన యారాటముతో, ఆత్రముతో ముప్పది వత్సరముల కాలము మూఁడు క్షణములుగఁ గడచిపోయినది!

ఇంత కాలము మనస్సు బిగియఁబట్టి, యాగదిని తెఱువకుండుటలో దేవదాసు నిగ్రహము చూపినాఁడు. ఇఁక నొక్క-లిప్తయైన మనస్సు నిలుపుట యాతనివలన సాధ్యము కాక పోయినది. ఆ గది తెఱుచుట యనిన దేవపిత యాజ్ఞనుల్లంఘించుట యను పరమసత్యము దేవదాసునకుఁ తెలియక పోలేదు. ఏదియైనకానీ, యాతని మనస్సు వశము తప్పినది.

ఈ సందర్భము లన్నియుఁ బూర్తిగఁ దెలిసియే, దేవదాసా చిన్నిగది చేరుకొన్నాఁడు. ఓరవాకిలిగ నున్నగదితలుపులు త్రోయుసరికెల్ల ముద్ర విడివడి, యాతనికి దారి యేర్పడినది.

'అయ్యో, చపలచిత్తుఁడనైతినే!' యను మనోవ్యథయొకవంక పీడింపసాగినది. ఐనను, దేవపిత వలదనిన యా-

గదిలో నేమి చిత్రమున్నదో చూడవలెనను కాంక్ష యగ్గలమై, గట్లు ప్రేరేంచుకొన్నది.

దేవదాసు మూలగదిలో ప్రవేశించి పోసాగినాఁడు. కొంతదూరమున నతనికొక యద్భుతమగు మందిరము కనఁబడినది. ఇంతవర కతఁడు చూచిన మందిరము లన్నిఁటి నిది తలఁదన్నుచున్నది. ఆ మందిరమునకు సరిగ మధ్యలో చక్కని సింహాసనమున్నది. సింహాసన మెక్కుటకు మెట్లున్నవి. అబ్బురపడి యిటు నిటు చూచినాఁడు దేవదాసు మెల్ల మెల్లఁగ నొక్కొక్క మెట్టె ఎక్కి, సింహాసన మధిష్ఠించినాఁడు.

సింహాసనమునకు రాజదండ మొకటి చేర వేయఁబడి యున్నది దాని నతఁడు చేపట్టినాఁడు. దేవదాసు దండము చేతఁబట్టెనో లేదో, క్షణకాలములో మందిరమునకు చుట్టు నున్న నాలుగోడలును మాయమైనవి. రాజదండము చేపట్టి యా సింహాసనముపైఁ గూర్చుండిన దేవదాసున కిప్పుడు భూలోకమంతయుఁ గన్నులకుఁ గట్టినట్టు గన్పట్టినది. భూప్రదేశమం దేమూల నేమి జరుగుచుండెనో యాతనికి విస్పష్టముగ గోచరించుచుండెను.

ఒక్కపరి ముందునకుఁ జూచినాఁడు – అది యాద్యంత ములు లేని మహాసముద్రము. ఆ మహాసముద్రముపై బయనిం చెడి యసంఖ్యాకములగు నోడలు! ఇవి యాతని కెంతయు నానందముఁ కల్గించినవి. అట్టె కుడివైపునకు దిరిగినాఁడు. ఇప్పుడు కనబడిన దొక వింత దేశము. ఆ దేశములో మతమం దందు విశ్వాసము లేని నాస్తికు లుందురు.

అటులే చుట్టును తిరిగి నాల్గవ దిశకు వచ్చుసరికి, దేవదాసునకుఁ దన మండలము, తన గ్రామము, తన యిల్లు కనఁబడినవి. పుట్టి పెరిగిన జన్మస్థలము కంటఁబడుసరి కాతని మనస్సులో ననేకములగు నాలోచనలు పరుఁగులెత్తి సాఁగినవి.

కన్న తలిదండ్రులు జ్ఞప్తికి వచ్చిరి. చిన్ననాఁటి హితులెందఱో గుర్తునకు వచ్చిరి. తాను పెరిఁగి పెద్దయైన యింటిపై మానవసహజములగు నభిమానము, మమకారము పుట్టుకొని వచ్చినవి.

"ఇపుడు నా యింటిలో నేమి జరుగుచున్నది? నావారందఱు నెటులున్నారు? ఈ యేఁడు పంట లెట్లు పండినవి?"— అనుచు నీవిధములగు నెన్నెన్నో ప్రశ్నలు సమాధానము చెప్పుమనుచు దేవదాసును తొలుముకొని రాఁజొచ్చినవి.

# 7. మూఁడు సంఘటనలు

దేవదాసు తొలుదొల్త తమ పొలములవైపు చూచినాఁడు. పండినపంట కోఁతలు జరిగి కుప్పలు వేయఁబడి నూర్పిడికి సిద్ధముగ నున్నది. ఇది చూచి దేవదాసు 'ఈ కుప్ప లించుమించుగ ఎన్ని కట్టలగును? వీనినుండి సుమారు ఎన్ని గింజలు రాలును? ఈ యేఁడు లాభనష్టము లెటులుండును?'—

అనుచు అంచనా వేయఁబోవు నంతలో, నా పొలములోని కెవరో బండి తోలుకొనివచ్చిన యలికిడి యైనది.

'ఈ రాత్రిపూఁట మా పొలమునకు మరెవరు రాఁగలరు? నా తండ్రియే వచ్చియుండును' అని దేవదా సూహించినాఁడు. ఐనను, బుద్ధిపుట్టి యట్టె యొకపరి యావైపు చూచుసరి కతఁడు దేవదాసుతండ్రి కాఁడు, 'ముసలయ్య' అను గజదొంగ! వాఁడు వరికుప్పలలోని కట్టలను గబగబ ఊఁడలాగి, బండిపై దట్టించుట స్పష్టముగఁ గనఁబడినది. ఇది చూచి దేవదా సుగ్రుఁడైనాఁడు.

"నాయనా!—అదిగో, ముసలయ్య మన పొలమునఁ జొఱఁబడి, ధాన్యపు కట్టలు బండి కెక్కించుచున్నాఁడు, చూడు!" అనుచు, నతఁడు కూర్చుండియున్న చోటి నుండియే గట్టిగఁ కేక వేసి తండ్రిని లేపినాఁడు.

ఆ సింహాసనముపైఁ గూర్చుండుటయు, రాజదండము చేపట్టుటయు—ఈ రెండు పనులవలనను దేవదాసున కతీత మగు నొక క్రొత్త శక్తి కల్గినది. ఈ శక్తివలన, నతఁడు పలు యోజనముల దూరమునఁ గల దివ్యభవనమునుండి మాటాడినప్పటికి—ఆ సమయమున నాతని తండ్రికిఁ గల గన్నట్టు లనిపించి, దేవదాసు చెప్పిన మాట లన్నియు స్పష్ట ముగ వినిపించినవి.

'పొలమునఁ బడి యెవ్వఁడో దొంగ మన ధాన్యపు కట్ట లెత్తుకొనిపోవుచున్నటులు కలఁ గంటిని. ఎందుకయిన మంచిది, ఒకపరి పోయి చూచి వచ్చెదను' అని యింటిలోఁ

జెప్పి, దేవదాసుతండ్రి యా యర్థరాత్రివేళ పొలమునకు బయలుదేఱినాఁడు.

దేవదాసుతండ్రి పొలము సమీపించి చూచుసరి కతని కల నిజమే యయినది. అప్పటికప్పుడే గజదొంగ ముసలయ్య బండినిండుగఁ గట్టలు దట్టించి యిఁక తోలుకొనిపోవుటకు సిద్ధముగ నుండెను. ఆ వెంటనే దేవదాసుతండ్రి చేరువ పొలాలలో నున్న యిరుగుపొరుగు మనుష్యులను కేకవేసినాఁడు. నలుగురును గలిసి ముసలయ్యను విఱిచికట్టి, మెత్తగఁ దన్ని మరునాఁడు వానిని గ్రామాధికారి కప్పఁజెప్పినారు. ఇన్నాళ్లకు పాపము పండి, ముసలయ్యకుఁ దగిన శాస్తి జరిగి నందుల కెల్లరు సంతసించిరి.

అటుపిమ్మట దేవదాసుదృష్టి తన దేవమాత నివసించెడి పట్టణముమీఁదఁ బ్రసరించినది. ఆమె యొక కోటీశుని తనయ యగుటచే సహజసిద్ధముగ విలాసవతి. విలాసార్థములగు వేడుకలకు వ్యయమెక్కుడగుట నైజము. ఆమె భర్తయో, కలిగినవాఁడు కాఁడు. కనుక, ఖర్చువెచ్చముల విషయమున భార్యను సంతృప్తిపఱుప లేకుండెను. లేనివానిని బీడించిన లాభమేమి?—"వ్రాఁతకోలఁది అసమర్థుఁడగు నిట్టి ధనహీనుఁడు నాకు లభించినాఁడు" అను మనోవ్యథతో నామె తఱచు పుట్టింటనే కాలక్షేపముచేయ నిచ్ఛగించుచుండెను.

కారణము లేమయిననేమి? ఆలుమగల నడుమ పొరపొచ్చెములు పెచ్చురేఁగినవి. చిలుక గోరువంకలవలె సుఖింపవలసిన యా దంపతులు—ఎడమొగము పెడమొగము పెట్టు

కొనుట సంభవించినది. వారి నడుమ వర్ధిల్లవలసిన స్నేహ లత వాడిపోఁజొచ్చినది.

పేదవాఁడే యగుగాక - ఎంతకాలమని యుండఁబట్ట గలఁడు ?—భార్యతిరస్కృతి యొకవంక, లోకులు మోఁపెడి నీలాపనిందలు మఱొకవంక ! ఆభర్త భరింపలేకపోయి నాఁడు. మనస్సు విఱిగిపోయినది. మఱియొక తెను కట్టు కొందమా యను సంకల్పముకూడ నతని మనమునఁ బ్రవే శించినది. ఇపుడు దేవదాసునకు బట్టిన మహిమవలన నామె భర్త మనోభావము నతఁడిట్టె పసిపట్టఁగలిగినాఁడు. దేవమాత కాఁపురము విష్కారణముగ మంటఁగలిసిపోవునే యను తహతహలో నతఁడు నిద్రించుచున్న తన దేవమాతను మేల్కొల్పి హెచ్చరిక చేసినాఁడు. ఈ పరిస్థితులామెను మఱింత రెచ్చఁగొట్టినవి. ఆపెకు రిమ్మయెత్తి కడకు కాఁపు రమే విచ్ఛిన్నమైనది.

లోకమున జరుగుచున్న యీ చౌర్యములు, ద్రోహ ములు, అసందర్భములు కనుటతో దేవదాసునకు మనస్సు వికలమైనది. దేవమాత యవస్థ యిటులున్నదే ! మఱి కన్న తల్లియైన క్షేమముగనున్నదో లేదో యను సంశయము పొడమినది. వెంటనే దృష్టి నటు మఱలించినాఁడు.

దేవదాసు చూచునప్పటికిఁ దండ్రివలెనే తల్లియు గాఢనిద్రలో నున్నది. నిద్రాసమయములో నుండుటయే కాదు, ఆమె భర్త కోఁతలకు వెడలియుండుటచే ఇప్పుడు ఒంటిపాటుగ నున్నది. ఈ యదనున, జోలుము

చేయుటలో పేరుగడించిన మండగీఁడు వారి యింటఁ దూఱి వస్తువాహానము లుండు పెట్టెను మాఱుతాళముతోఁ దీయఁబోయెను. కొద్దిపాటి సవ్వడికే యామె మేల్కాన్నది. ఆమె పోయి, నలుగురిని పిలుచుకొనివచ్చునను భయముతో మండగీఁడు మొలనున్న కత్తి తీసి ఝుళిపించెను. తల్లి యిట్టి విపత్తులో నుండుటను దేవదాసు సహింపలేకపోయెను. కోపము ఆఁపుకొనఁజాలక అప్రయత్నముగఁ జేతనున్న రాజదండమును వానికి గుఱిపెట్టి విసరినాఁడు. అది వజ్రాయుధమువలె రివ్వుమనివచ్చి దుండగునకు సరిగా కణఁతపైఁ దగిలినది. రాజదండము ఆయువుపట్టునఁ దగులుటచే నుఱి పిలుపు లేకయే వాఁడు గిలగిల తన్నుకొని నేలఁగూలినాఁడు.

# 8. పరిణామము

ఏ క్షణమున దేవదాసు తన చేతనున్న రాజదండమును విసరెనో, ఆ క్షణమందే యది పోయి దొంగను బరిమార్చెను. దొంగ చచ్చినదే తడవుగ నదృశ్యములై యుండిన గోడలు నాలుగును మఱల కూడుకొని, యెప్పటివలె గది యేర్పడినది!

మూలగది యేర్పడిన వెంటనే, ఎక్కడినుండి వచ్చెనో కాని, దేవపిత తలుపు తెఱచుకొని, గదిలోపలఁ బ్రవేశించి

నాఁడు. మునుపటివలె నిప్పుడు దేవపిత వదనమున మందహాసము లేదు. గదిలోఁ బ్రవేశించుచునే యాయన చేయి పట్టి దేవదాసును గద్దెనుండి దింపివేసినాఁడు.

"కుమారా!— నీ వెంతో మంచిపిల్లవాఁడ వనుకొంటిని. నా మాట మన్నించెద వనుకొంటిని. నిన్ను నమ్మి, యీ భవనము, ఆరామము నీ కప్పగించి పోయితిని. కాని, నామాటపైని నీకు గౌరవము లేదని ఋజువుచేసినావు. నీవు నమ్మఁదగినవాఁడవు కావని నీ చేష్టలవల్ల నీవే చాటుకొన్నావు. నా యాశలన్నియు నడుగంటఁ జేసినావు,' అని యనుసరికి దేవదాసు ముఖము పాలిపోయినది.

దేవపిత యిఁకను చెప్పుచునే యున్నాఁడు: 'నాయనా నాఁడు!— నేను చెప్పిపోయిన యొక చిన్నమాట నుల్లంఘించుటవలన నీ వెన్ని తప్పిదములు చేసినవాఁడవైతివో, ఆ తప్పిదము లెట్టి దుష్ఫలితములకు దారి తీసినవో, ఈ దుష్ఫలితములవలన లోకమున కెంతటి ముప్పు వాటిల్లెనో విప్పి చెప్పితినేని నీవు సిగ్గుపడవలసివచ్చును' అనుచు నట్టె యొక్క క్షణముసేపు బుడుతనివంక చూచెను.

'వలదు వలదు' అని శాసించి చెప్పినప్పటికి, వాలాయముచేసి మూలగది తెఱచుట యన్నిటికంటె ముఖ్యమగు పెద్దతప్పు. గది తెఱచి యూరకొంటివా? పుట్టు పూర్వోత్తరములు తెలిసికొనకయే సింహాసనము నెక్కి, రాజదండము చేతపట్టితివి. ఇది రెండవ తప్పిదము. అంతతోనయిన మిన్నకుంటివా? రాజదండము చేపట్టి, గద్దెపైఁ గూర్చుండి

యేమేమి పనులు చేసితివో అవన్నియు, నేఁ జెప్పుట యెందు లకు, నీ మనస్సునకే యెఱుక. పిన్నవాఁడా!—నీకుఁ దెలి యదుగాని, నీవు చేసిన యొక్కొక్క పనివలన ప్రపంచములో నధర్మ మెంతవఱకు హెచ్చినదో నీ వూహించుటకైన సాధ్యముకాదు. నీవంటి ప్రబుద్ధుఁడు మఱికొంచెము సే పిక్కడ కూర్చుండి యున్నచో, ఈపాటికి లోకము సగము నాశమై యుండును,' అనుచు దేవపిత నిందించినాఁడు.

ఇట్లు నిందించినపిమ్మట దేవపిత మఱల నొకపరి కుట్ర వానిని గద్దె నెక్కుమని రాజదండమును తాఁ జేతఁబట్టినాఁడు. మునుపటివలెనే మరల నొకసారి గదిగోడలు నాలుగు నెడమై, భూలోకమంతయు కన్నులకుఁ గట్టినట్లు గోచరించి నది. కూర్చున్న చోటినుండియే భూలోకపువిశేషములను దివ్యదృష్టివలనఁ గనిపెట్టినట్లుగఁ దెలిసికొన దేవదాసునకు వీలయినది.

తొలుత దేవపిత పిన్నవాని జన్మస్థలమును వ్రేలు పట్టి చూపి యిట్లు చెప్పెను: 'మమకారముచే నీవు నిద్రించు చున్న నీ తండ్రిని మేల్కొల్పి యాతని కెట్టి చేటు తెచ్చి పెట్టితివో చూడుము—నలుగురను ప్రోగుచేసి నీ తండ్రి ధాన్యపుఁ గట్టలుదొంగిలించిన ముసలయ్యనుపట్టి అధికారులకు ఒప్పగించినాఁడు. బాగుగనేయున్నది. విచారణ జరిపి దొంగ కొక యేఁడాది ఖైదు వేసినారు. ఈ శిక్షను వాఁ డవలీలగా ననుభవించి పూలరంగనివలె నింటిని జేరుకొనినాఁడు. ఈ శిక్షవలన దొంగ యిప్పుడు మొఱటుబాఱి మఱింత మొండి

కెత్తినాఁడు. చెఱసాల జీవితమనిన నింతియేకదా అని యని పించినది. శిక్ష పడకముందు చెఱసాలకుఁ బోవుట యనిన నేమో యని వాఁడు భయపడెడివాఁడు. ఒకసారి పోయి వచ్చుటతో వానికి జంకు తీఱినది. ఇప్పుడు ముసలయ్య యెన్ని సారులయినను చెఱసాలకుఁ బోయివచ్చుటకుఁ దయారుగనే యున్నాఁడు.

అట్టియెడ వాఁడింకను దుండగములు సేయుట కుద్యుక్తుఁడగుటలో నాశ్చర్యమేమున్నది?—దొంగనుబట్టి యధికారుల కప్పగింపకుండినచో నా బండెఁడు ధాన్యపుఁ గట్టలతోఁ దీఱిపోయెడిది: వానికి నొకవిధమయిన తృప్తి యుండెడిది. తనంతట తనకే మనస్సు మాఱి బుద్ధివచ్చెడిది. మఱల మనజోలికి రాకుండ వెళ్లిపోయెడివాఁడు. కాని—

వానిని శిక్షింపించుటతో ఇప్పుడు వాఁడు పగఁబట్టిన పామువలె నీ తండ్రిపైని కసి పూనినాఁడు. మీ పశువులను రెండింటిని దొంగతనముగాఁ దోలుకొనిపోయి దూరపు సంతలో విక్రయించివేసినాఁడు. అంతటితో తీఱినదా?— ఇంకను కక్ష సాధింపవలెనను పట్టుదలతో, అదిగో—మీ ధాన్యపు గాదెలకు నిప్పు పెట్టుచున్నాఁడు. నిశ్చింతగ నిద్రించు చున్న నీ తండ్రి ననాలోచితముగ నాత్రముచే మేల్కొలిపి యతనికి మేలు చేయఁబోయి నీవు తెచ్చిపెట్టిన ముప్పే యిదంతయును. తెలిసినదా?—' అనెను.

ధాన్యపుగాదె లంటుకొన్నవి. వానినుండి మంటలెగసి వచ్చుట దేవదాసునకు స్పష్టముగా గోచరించినది. అతఁడు

కలవరపడు స్థితి వచ్చునంతలో దేవపిత యీ దృశ్యమును మఱుగుపఱచి వాని దృష్టిని మఱొక దిక్కునకు మఱలించినాఁడు.

'కుమారా!—ఇటువైపు చూడుము—నీ దేవమాతకు నామెభర్తకును సంసారములో కలఁతలు పుట్టి యిరువదిరెండవ వత్సరమయినది. ఈ లోపల నాతని బుద్ధి పూర్తిగ మాఱిపోయినది. కట్టుకొనిన భార్యపై రోఁత పుట్టినది. ఇంతకుమునుపు లోకులకు వెఱచి వీధిని బడుట కిచ్ఛగింపక గుట్టుగ బాధ భరించెడివాఁడు.

నీవు నీ దేవమాతను నిద్రలేపి ఆతని మనోభావమును వెల్లడించినప్పటినుండియు రోసు పెరిగినది. ఇప్పుడతనికి నిజసతి యందుఁ గల యనురాగము పూర్తిగ నంతరించినది. ఆమె కును భర్తపై నుండవలసిన భక్తిగౌరవములు సడలిపోయినవి. ఇప్పుడతఁడు తమకముచే బహిరంగముగనే తన యుద్దేశమును చాటుకొనినాఁడు.

ఆమె పుట్టింటివారు శ్రీమంతులే కావచ్చును. ఆమె జరుగుఁబాటున కెట్టి లోపమును లేకపోవచ్చును. కాని, 'మగఁడు విడిచిన మగువ'యని లోకులు వేసిన ముద్రను మాత్ర మామె తప్పించుకొనలేకపోయినది. ఇప్పుడు చేయఁ గలదేమున్నది?—ఈ విచారమునుబట్టి యామెకుఁ దీరని మనోవ్యాధి పట్టుకొన్నది. ఈ గృహచ్ఛిద్రమును మఱచుటకై యటుభర్తయు, ఇటు భార్యయుఁ గూడ మైకము గలిగించు పదార్థములను సేవింపఁగడంగిరి. ఆమె నిజమునకు

సన్మార్గరూలే. అయిననేమి?—ధనగర్వముచే—పండువంటి కాఁపురమునకు చేతులార నీళ్లు వదలుకొనవలసివచ్చెఁగదా యను సంతత చింతతో చావలేక బ్రతికియున్నది. సదుద్దేశముతో నీ దేవమాతను నిద్రలేపి నీ వామెకుఁ జేసిన మహోపకారమిదియే’ అని దేవపిత చెప్పెను.

# 9. పరిహారము

దేవమాతను గుఱించిన జీవితరహస్యములు విన్న వెంటనే ‘అయ్యో! ఎంతటి ఘోరమగు తప్పిదము చేసియుంటిని!’ అని తలఁచి, పిన్నవాఁడు దీర్ఘముగ నిట్టూర్చెను. సిగ్గుతో శిరస్సు వంచుకొనెను. ఈ వాలకము కనిపెట్టిన దేవపిత వానిని మఱపింపఁదలఁచి, యీ దృశ్యమునుకూడ మార్చివైచెను.

ఇప్పు డతనికి మఱల తన యిల్లు, ఇంటిలో నతని కన్నతల్లి పండుకొను గది చూపినాఁడు. ఆ గదిలో దేవదాసు తల్లి ‘అలో’ యని విలపించుచున్నది. ఇందులకుఁ గారణము గలదు. అసాధ్యమగు నేదో యొక వ్యాధి యామె శరీరమున జీర్ణించియుండెను. మందులు మాఁకులు నిరుపయోగములాయెను. సాక్షాత్తుగా అశ్వినీదేవతలు దిగి

వచ్చిన నామె రోగమును గుదుర్పలేని స్థితిలో నుండుటచే నామె కోరి మరణదేవతను నిరంతర మాహ్వానించుచుండెను.

ఈ స్థితిలో నా దుండగీఁడు వచ్చుట, కత్తితీసి ఝుళిపించుట కేవలము వరప్రసాదముగ నామె యెంచినది. కాని, తలవని తలంపుగఁ దన్ను చంపఁబోయి యా దుండగీఁడే చచ్చిపడియుండుట యామెను తీఱని దుఃఖములో ముంచినది.

'నావంటి పాపాత్మురా లింకను బ్రతికియుండుట యెందులకు ? "పాపీ చిరాయు" వను పెద్దల మాట నాపట్ల సార్థక మగుచున్నదే! రాత్రి యా దొంగ యొఱనుండి తీసిన కత్తి నాకుఁ దగులకపోయెనే! ఈ పాపాత్మురాలి కళేబరము తాఁకుట కా కత్తికిఁగూడ నిష్టము లేకపోయినదా ? రాత్రి వచ్చిన యా దొంగ నిజముగ నాపాలిటి దేవుఁడే యని నమ్మితిని! ఒక్కవ్రేటుతో వాఁడు నాకు జన్మరాహిత్యము చేయుననియు, భూదేవికి భారము దీఱిపోవుననియు సంతసమందితిని. కాని...పాపము పూర్తికాకుండ నాకు చావెట్లు వచ్చును ? ఇట్లనుకొనుటయే కాని, చచ్చుట మాత్రము నా యిష్టములో నున్నదా ? ఇంక నీ భూమిపై నాకు నూకలెన్నాళ్లవఱకు నున్నవో! ఇంక నెన్నెన్ని కాని పనులకు నే నొడిఁగట్టుకొనవలెనో !'—

ఇటు లని శోకించుచున్న యామె, యున్నటులే యుండి బాధతో గిలగిల కొట్టుకొనసాఁగెను. 'దినమొక యుగముగ నున్నది దేవా! ఇఁక నొక్క క్షణమైన నిలువలేను. నన్ను మఱొక [illegible] పుణ్యము కట్టు

కొనుమోయి ప్రభూ!' అనుచు నామె వెక్కి వెక్కి యేడువఁ జొచ్చినది. అహర్నిశము లిదే వరుస!

ఇదంతయుఁ జూచుసరికి, దేవదాసు కన్నులవెంట నప్రయత్నముగ బాష్పధారలు ప్రవహించినవి. వెంటనే దేవపిత తన రాజదండము సాయమున నీ దృశ్యమును సైతము మార్చివేసెను. పిన్నవానితో 'వత్సా!—ఇటు చూడుము' అనుచు, మఱియొక దృశ్యముపై వాని మనస్సు మరల్చెను.

దేవపిత యాజ్ఞ ననుసరించి దేవదాసు క్రిందకుఁ జూచినాఁడు. అట, కారాగారము కడ—ఒక దొంగ నిరువురు రక్షకభటులు చేక్కలు వెడవిఱిచి కట్టి, వాఁడు తప్పించుకొనిపోకుండ గట్టిగఁ బట్టుకొనియుంట దేవదాసునకుఁ గనఁబడినది. దిగ్భ్రమ చెందిన పిన్నవాని నుద్దేశించి దేవపిత యిట్లనెను:—

'చూచితివా! ఆ దొంగ యిప్పటికి తొమ్మండుగురిను హత్యచేసిన కూనీలరాయఁడు. పాపము పండి, యందుకుఁ దగిన ప్రాయశ్చిత్తమును వాఁడు పొందవలసినదే! కాని, వాఁడు చేసిన పాపములన్నిటిని మధ్య నీవు మెడకుఁ జుట్టుకొంటివి. ఇది కేవలము నీవు స్వయముగఁ దెచ్చిపెట్టుకొన్న యపరాధము. కావున, అనుభవింపక తప్పదు.

'జ్ఞప్తియందున్నదా, అడవిలోని భల్లూకము—ముందొకపరి కొయ్యదుక్కను పైకినెట్టి తన పిల్లలకు ముప్పు తెచ్చుకొన్నది. అంతటితో నూరకొనక రెండవసారి

దుక్కను త్రోసి, ముద్దు కూనను గడతేర్చుకొన్నది. అప్పటి కైన బుద్ధివచ్చెనా?--తామసముకొలంది మూడవసారి మరల దుక్క నెగురఁగొట్టినందున దాని ప్రాణములకే మోసము కలిగి, అది నేలఁగూలుట తటస్థించినది!

'నీ చర్యలు చూడ, నీకును నా యెలుఁగునకును నడుమ వ్యత్యాసమే కనఁబడుటలేదు. సరి! అయిన దేదో యైనది. ఆ వైనము లన్నియు నెమరునకు తెచ్చుకొని మాత్రము లాభమేమి? నేటినుండి నీకు ముప్పది వర్షములు గడువిచ్చుచున్నాను. ఆ దొంగ చేసిన పాతకములు నీ మెడకుఁ జుట్టుకొన్నందున—ఈ ముప్పది వర్షముల గడువులోఁ బ్రపంచపర్యటన చేసి, లోకములోని మంచిచెడ్డలు, కష్టసుఖములు తెలిసికొంటివేని అప్పటికి నీవు ప్రాయశ్చిత్తము పొందెదవు. పాపపరిహారము నగును' అనుచు దేవపిత హెచ్చరిక చేసినాఁడు.

మొదట దేవపిత మాటను ధిక్కరించినందులకును, తదుపరి వరుసగ నెన్నో తప్పిదము లొనరించినందులకును పిన్నవాఁడు మనస్సులోఁ జాల కుందినాఁడు. ఐనను—ఇప్పుడు దేవపిత చేసిన హెచ్చరిక వాని కొకింత యూఱట కలుగఁజేసినది.

పశ్చాత్తప్తుఁడైన దేవదాసప్పుడు 'తండ్రీ!—అజ్ఞానాంధకారములో మునిఁగియున్న యమాయకుఁడను. ముక్కు, మూలము తెలియనివాఁడను. మీ మాట జవదాఁటి నేఁజేసిన దొసఁగు లనంతములు. ఎఱిఁగి మఱెన్నఁడు నిట్టి

దుక్కను త్రోసి, ముద్దు కూనను గడతేర్చుకొన్నది. అప్పటి
కైన బుద్ధివచ్చెనా?--తామసముకొలఁది మూఁడవసారి మరల
దుక్క నెగురఁగొట్టినందున దాని ప్రాణములకే మోసము
కలిగి, అది నేలఁగూలుట తటస్థించినది!

'నీ చర్యలు చూడ, నీకును నా యెలుఁగునకును
నడుమ వ్యత్యాసమే కనఁబడుటలేదు. సరి! అయినదేదో
యైనది. ఆ వైనము లన్నియు నెమరునకు తెచ్చుకొని
మాత్రము లాభమేమి? నేఁటినుండి నీకు ముప్పది వర్షములు
గడువిచ్చుచున్నాను. ఆ దొంగ చేసిన పాతకములు నీ
మెడకుఁ జుట్టుకొన్నందున—ఈ ముప్పది వర్షముల గడు
వులోఁ బ్రపంచపర్యటన చేసి, లోకములోని మంచిచెడ్డలు,
కష్టసుఖములు తెలిసికొంటివేని అప్పటికి నీవు ప్రాయశ్చిత్తము
పొందెదవు. పాపపరిహారము నగును' అనుచు దేవపిత హెచ్చ
రిక చేసినాఁడు.

మొదట దేవపిత మాటను ధిక్కరించినందులకును,
తదుపరి వరుసగ నెన్నో తప్పిదము లొనరిచినందులకును
పిన్నవాఁడు మనస్సులోఁ జాల కుందినాఁడు. ఐనను—
ఇప్పుడు దేవపిత చేసిన హెచ్చరిక వాని కొకింత యూఱట
కలుగఁజేసినది.

పశ్చాత్తప్తుఁడైన దేవదాసప్పుడు 'తండ్రీ!—
అజ్ఞానాంధకారములో మునిఁగియున్న యమాయకుఁడను.
ముక్కు, మూలము తెలియనివాఁడను. మీ మాట జవదాఁటి
నేఁజేసిన దోసఁగు లనంతములు. ఎఱిఁగి మఱెన్నఁడు నిట్టి

జెప్పుము. అటులే చుట్టుప్రక్కల గమనించుచు, పర్యటనము సాఁగింపుము. నాల్గవ రోజున నొక ఘోరారణ్యమును ప్రవేశింతువు. అందొక గుహ కనఁబడును. ఆ గుహలో నొక వృద్ధుని దర్శనమగును. ఆ క్షణమువఱకు జరిగిన కథ యంతయు దాఁపఱికము లేకుండ నా వృద్ధునికి నివేదింపుము. నీ చరిత్రమంతయు సావధానముగ నాలించి, యాయన నీ కుపదేశము చేయును. గుర్వాజ్ఞ మీఱక, యా వృద్ధుఁడు చెప్పినటుల నడచుకొంటివేని నీవును, నీవు బాధ్యత వహించిన దొంగయు పాపవిముక్తు లగుదురు.'

ఈ మాటలు చెప్పి, దేవపిత పిన్నవానిని దీవించి యా భవనమునుండి సాఁగనంపెను.

# 10. లేఁగదూడ యాగడము

'లోకమున కుపకరించెడి కొన్ని సుకృతములవలన నా దుష్కృతముల ఫలితమును పోఁగొట్టుకొనవచ్చునని దేవపిత సలహా యిచ్చినాఁడు. బాగుగనే యున్నది. ఈ మాటలు చూడ సుకరముగనే కన్పించుచున్నయవి. కాని, పాపములు పోఁగొట్టుకొనుట యాచరణములో నంత తేలికయిన పనిగాఁ దోఁచదే!—

'పోనీ - లోకము పోకడ చూచెదము : న్యాయస్థానములలో సామాన్యముగ - తప్పిదములను విచారణచేసి న్యాయాధిపతులు చేసెడిదేమి ? ఒక వ్యక్తి దోషియని ఋజువయినచో, అతని నేరముయొక్క యెక్కువ తక్కువ లనుబట్టి శాస్త్రములలోఁ జెప్పిన చొప్పున దోషికి చెఱ విధింప వచ్చును. వానిని ద్వీపాంతరము పంపవచ్చును, లేదా - ఉరిశిక్ష విధింపవచ్చును. అనఁగా - పాపకార్యము చేసినవానిని సంస్కరించి బాగుపఱచు సంకల్పముతో న్యాయమూర్తులు శిక్షవిధించి క్రొత్తపాపముల కొడికట్టుకొనుచున్నారన్నమాట!

'ఇదేమిపద్ధతి? వింత! విడ్డూరము!!—దీనివలన పాపమనునది మఱింత వృద్ధియగుచున్నదేకాని, తగ్గుటలేదే! పాపము తగ్గుట కవకాశము లేనప్పుడది పూర్తిగఁ బరిహార మగుటయు, మనకు విముక్తి కల్గుటయు నెట్లు సంభవించును? ఇట్టి లోపముగల పద్ధతిని మన ఋషిపుంగవు లెటుల సమ్మతించిరి? శ్రుతులు, స్మృతులు సృజించి లోకోపకారార్థమై యెవ్విధమున ననుగ్రహించిరి ? — ఆలోచించినకొలఁది మనస్సు మిక్కిలియెక్కువగా కలవరము చెందుచున్నదే! ఈ పరిస్థితులలో, నా మెడకుఁ జుట్టుకొనియున్న పాపములను నివారించుకొనుట, ఇఁక ముందు క్రొత్తపాపము లంటకుండ వారించుకొనుట - జరిగినప్పుడు కద ముక్తిమార్గము కనుగొనఁ గల్గుట ? ఇది నాకెట్లు సాధ్యపడును ?'

ఇట్టి తలఁపులతో దేవదాసు తీవ్రమైన జిజ్ఞాసలో పడినాఁడు. అతనికేమియుఁ బాలుపోలేదు. ఎంత యోజిం

చిన నుపాయమెద్దియు స్ఫురింపలేదు. అప్పుడతఁడు 'దేవా!-నిన్నే నమ్ముకొంటిని. నీదే భారము! నాకేదైన సరియగు త్రోవఁజూపి, తరింపఁజేయు!' మనుచు నా జగన్నాటకసూత్రధారుని వేఁడుకొనెను. ఎవరైన నింతకు మించి చేయఁగలదేమి ?

ఈ యాలోచనలతో దేవదాసు కొంచెముదూరము వెడలుసరికి, సరిగా దేవపిత చెప్పినటులే, కోఁతకు సిద్ధముగ నుండి కన్నులపండువు చేయు పసుపు పచ్చని చేను కనఁబడినది. ఆ సమయముననే, ముద్దులు మూటకట్టెడి యొక లేఁగదూడ చెంగు చెంగుమని గంతులు వేయుచు వచ్చి, యా చేనిలోఁ జొరఁబడినది.

అది దారి తప్పివచ్చి చేనిలోపలఁ జొరఁబడినదే కాని, మేఁత కాశపడి కాదు; పాడుచేయుదమను నుద్దేశము దాని కసలే లేదు, పాపము! ఐనను, పొలముకాఁపులు పొలికేకలు వేసి, చప్పటలుచఱచి దానిని బెదరఁగొట్టిరి. వారికి చేను పాడగునను నాత్రము తక్క మఱొక యాలోచన లేదు. దూడ బయటఁబడుదమని చేనిలోనుండి తొంగిచూచునంతలో నింకొక రయితువచ్చి మఱల దానిని లోపలకుఁ దఱిమెను. ఇటులా కాఁపులు కంగారుతో లేఁగ నీవలకు రానీయనందున, నది లోలోపలనే తిరిగి తిరిగి, యాచేనిఁ గలయఁద్రొక్కఁ జొచ్చినది. అంతమంది రైతులును కలిసి దూడను పెక్కు త్రిప్పులు పెట్టిరే కాని, యది తప్పించుకొనిపోవుట కవకాశ మీయరైరి.

ఇటులుండ — అక్కడి కొక వృద్ధురాలు వచ్చినది. ఆమెకు నడుము వంగిపోవుటచేఁ జేతికఱ్ఱ ఆసరాతో మెల్లఁగ నడుగులు వేయుచుండెను. పొలముగట్టుపైఁ జాలమంది జనముండుటఁ గని, యచ్చోటు చేరుకొన్నది. వణఁకుచున్న కంఠస్వరముతో నామె 'నాయనా!—మా లేఁగ యిటు వైపు వచ్చినదా?—బట్టలదూడ; ముఖమున బొట్టుకూడ నుండును...' అనుచు దీనముగ వారి నడిగెను.

ఈ మాటలు విన్నవెంటనే దేవదాసు ఆ రైతులను పిలిచి, 'ఏమయ్యా కాఁపులూ! — ఎంత సేపటినుండియో చూచుచున్నాను, ఏమది మీరు చేయుచున్న పని? పాప మా లేఁగను లోనికిఁ బోనీయరు, బయటికి రానీయరు. అనవసరముగ మీరు కలవరపడి, దానికి కంగారెత్తించు చున్నారు. పోనిండు, అయిన దేదో యైనది. నా మాట విని, ఒక్కసారి మీ రందఱు నివలకు రండు. ఈ ముసలిది వెదకి కొనుచు వచ్చినదికదా, ఒకవేళ నా లేఁగ యీ వృద్ధురాలి దేమో చూతము' అనుచు వారిని మందలించినాఁడు.

తరువరి దేవదా సామెవైపు తిరిగి, 'అవ్వా!'—ఎవ రిదో కాని యొక లేఁగదూడవచ్చి యీ చేనిలోఁ దూఱినది. చేను పాడగునను భయముతో నీ రైతులందఱు గుమికూడి, దానిని తఱుముచున్నారు. వీరి గోల చూచి యది భయపడు చున్నది. మఱి, యీ లేఁగ నీదగునో కాదో యెట్లు తెలియును? అని యడిగెను.

'నా తండ్రీ! నా బాబే!! తీయని మాట చెప్పినావు నాయనా !!!— గంటసేపాయె, బిడ్డకోసము తిరుగులాడు చున్నాను కొడుకా!' అనుచు ముసలిది తన మనస్సులోని బాధ వెల్లడించినది.

దేవదాసు మాటపైని కాఁపులందఱును చేనిగట్టు దిగి యీవలకు వచ్చినారు. అప్పుడు ముసలిది 'దాయి, దాయి! బాబీ!!' అనుసరికి, అవ్వగొంతుక యానవాలు పట్టిన యా చిన్నిలేఁగ చెవులు ఱిక్కించి, వాయువేగమున నొక్క గంతులో వచ్చిపడి, ముట్టెతో ముసలిదానిని మూర్కొన్నది. ఆ సందడిలో నది యామె కాలుకూడ త్రొక్కికొని పోయి నది. కాని, దూడ యాఁగడము లవ్వకలవాటే, కనుక కాలు నొచ్చినను, ముసలిది మనస్సులో బాధపడలేదు.

ఈ విధముగ నొక్క పిలుపునకు లేఁగదూడ యీవలకు వచ్చివేయుటతో కాఁపులందఱును సంతోషించిరి. దానిని పెంచెడి యవ్వయు నమితానందముఁ బొందినది. సమయము నకు వచ్చి యవ్వ తన్ను తప్పించినందులకు లేఁగయు నెంతో యుత్సాహపడినది.

ఈ దృశ్యము దేవదాసునకు మనఃఫలకమున నచ్చు పడిపోయినది. బహువిధముల నతఁ డిట్టుల తలపోయసాగెను: 'ఇపు డీ లేఁగదూడ సంగతి చూడ, శిక్షనలన పాపము పెరిఁగి పోవునే కాని, పీసమువాసిపైనను దఱుఁగదని ప్రత్యక్షముగ ఋజువగుచున్నది. ఇంతమంది పొలముకాఁపులు చుట్టుకుచేరి లేనిపోని యాత్రముతో చేను పాడగునను భయముతో

దాము కలవరము చెంది, లేఁగను కంగారుపెట్టిరి. చేని లోపలఁ జొరఁబడినందుల కా మూఁగజీవమును పట్టి శిక్షించ వలెనని పంతముపట్టి, నలుగురును నలువైపులు గాచి, పులి వేఁటకుచేసినంత హంగామా చేసినారు. ఫలితము శూన్యము.

'లేఁగను పెంచెడి యవ్వవచ్చి, యాప్యాయముతో నొక్కసారి పిలుచుసరి కది యొక్క గంతులో వాయువేగమున నామెయొద్దకు వచ్చి పడినది. ఏమి యీ చిత్రము!—అంత మంది కాఁపులు చేయలేని పనిని ప్రేమపూరితమయిన యొక్క పిలుపుతో నా ముసలిది నెరవేర్పఁగలిగిన దే?— ఏమి యీ సృష్టిరహస్యము !!—'

'ఇంతకును, నామాట విని రైతు లలుక మాని నిదా నించుటవలన వారికిని బాధ తప్పినది. ముసలామె సంతో షించినది. లేఁగదూడ యుత్సాహముతో నింటికిఁ జేరు కొనినది.'

దూర మాలోచింప నాకుఁ దోఁచిన మాట యిది: 'ఎంతమంది బలశాలురు కలిసి కక్షగట్టియు, నొకపనిని సాధించలేకపోయిరి. వారికి సాధ్యముగాని యాపని నవధ్యు రాలయిన యొక అవ్వ, ప్రేమతోఁ గూడిన చిన్న పిలుపుతో చిటికలో సాధింపఁ గలిగినది. అనఁగా-ప్రేమతత్త్వములో నంతటి మహత్తు కలదన్నమాట! ప్రేమతోఁగూడిన యా పలుకులు మంత్రాక్షతలవలె పనిచేసిన వన్నమాట !!—

'ఇప్పుడీ లేఁగదూడ సంఘటనవలన జీవితములో నేను గొప్ప పాఠము నేర్చుకొంటిని. ఈ సంఘటన నలంతి విషయముగ నెంచి యుపేక్షింపఁజాలను.'

'పాలెముకాఁపులు లేఁగను శిక్షింపఁబోయి, యింకొక పాపమున కొడిఁగట్టుకొన సిద్ధపడిరి. వారు చేయఁ బోయిన పనివల్ల పాపము వృద్ధిపొందునేగాని తగ్గుటకవకాశము లేదు. అవ్వ పలికిన యొక్క ప్రేమవాక్కు వలన పాపము పరిహారమై యెల్లరకును సంతోషము కలిగినది. శాంతియు, సౌఖ్యమును చేకూరినవి. కావున,—అవ్వ చెప్పిన పాఠమే యొప్పు, అదే పుణ్యకార్యము; ముక్తిమార్గము; పుణ్యము చేసి, పాపము పోఁగొట్టుకొనుమని నా దేవపిత బోధించినది బహుశః యిదేయేమో!—'

ఇవ్విధమున దేవదాసొక నిశ్చయమునకు రాలేక తనలోఁదాను పలువిధములఁ దర్కించుకొనుచుఁ గాలు సాఁగించుచుండెను.

## 11. తెలివితక్కువ పనులు

దేవదాసు పోయిపోయి, చివరి కొక గ్రామము చేరుకొనెను. అప్పటికే చీఁకటిపడుటచే అడుగు పడుట కష్టమైనది. అందుచేత రాత్రి ఆ యూరనే గడపి, తెల్ల

వ్రాసిన పిదప ముందునకు సాగవచ్చునని తలంచినాడు. ఊరు క్రొత్త. ఎవరినైనను పలుకరించి పరిచయము చేసికొందమనిన నోరావ లేకపోయెను. అటులే చూచుకొనుచు నూరంతయుం గలయందిరుగునప్పటికి పూటు మఱంగినది. అందుచేత నిపుడు ఒక దొరకు నవకాశము మఱియు సన్నగిల్లినది.

అదృష్టవశమున, నాతం డూరిచివరకుం బోవుసరికి— ఒకే యొక యింటి తలుపు తెఱచియున్నది. అది యొక సంపన్నగృహస్థుని యిల్లు. అందు దీపాలు దివ్యముగా వెలుంగుచున్నవి. ఆ యింటి యజమానురాలు ఇల్లు చక్కం జేసికొను తాపత్రయములో మునింగియున్నది. దేవదాసు తన స్థితిని వెళ్లంబోసికొని, రాత్రికిం దలదాంచుకొననిమ్మని కోరంగా. నా యమ 'వల్లె' యనినది.

అతం డా యిల్లాలు చూపిన స్థలమునం జేరి, స్తిమితపడి నాండు. ఐనను. స్థలము క్రొత్త దగుటచే నిదురపట్టక దేవదాసామె చేయు పనులను గమనింపంజొచ్చెను. ఆమె యిల్లంతయు కడిగినది. తడి యాఱుట యాలస్యమగునని యొక గుడ్డతో కడిగినయిల్లు తుడిచినది. ఆ తడిగుడ్డతోనే మేజాలు, బీరువా యద్దములు తుడువ నారంభించినది. తుడుచుచున్నపుడు మేజాలు, అద్దములు శుభ్రపడినటులే కనంబడినవి. కాని, మఱియొక మూలనుండి క్రొత్తముఱికి మఱల అంటుచునే యుండెను.

అది మురికి యోడుచున్న గుడ్డ యగుటచే, ఆమె యెంతగా నదిమి తుడిచినను, సామగ్రు లెప్పటియటుల నస

వ్యాముగనే తయారగుచున్నవి కాని, శుభ్రపడుట లేదు. ఇల్లాలు పడుచున్న యవస్థ యంతయు దేవదాసు చూచి నాఁడు. చూచి చూచి, యుండఁబట్టలేక, 'ఏమి చేయుచుంటి వమ్మా తల్లీ!' అని ప్రశ్నించినాఁడు.

అందుల కామె 'నాయనా! నీ కన్నులతో నీవే చూచుచుంటివి కద! అవతల పండుగలు తఱుముకొనివచ్చు చున్నవి. ఇంటిపను లెంతకును తెమలుట లేదు. బల్లలు తుడిచి బాగుచేయుద మనుకొంటిని. అవి నన్ను త్రిప్పులు పెట్టు చున్నవి; కాని, శుభ్రపడు దారి కనఁబడదాయెను. అబ్బ! ప్రాణము విసుగెత్తిపోవుచున్నది బాబూ!' అనుచు, మన న్సులోని బాధ వెళ్లఁబోసికొన్నది.

ఈ మాటలు విని దేవదాసు 'ఎంత యమాయకురాల వమ్మా!—ఆ మురికిగుడ్డతో మీ రెంత సేపు తుడిచినను వస్తువులు బాగుపడవని తెలియదా? ముందుగా,-ఆ గుడ్డను తడిపి, తెల్లఁగా నుతికి తెచ్చి, యా పిదప తుడువుఁడు. అవేల శుభ్రపడవో చూచెదను' అని సలహా చెప్పెను.

సరిగా నాతఁడు చెప్పినటులే యామె చేసినది. మేజాలు, బీరువాలు, అద్దములు—అన్నియు నిపుడు సరిక్రొత్త సామ గ్రులవలె కనిపించుసరి, కిల్లాలి యానందమున కిఁక మేర లేక పోయినది. 'వత్సా!—వయస్సున పిన్నవాఁడవైనను, ఎంత చక్కని యుపాయము చెప్పినావు! నీ కెంత యయిన పుణ్య మున్నది. ఇన్ని యేండ్లు నెత్తిమీఁదికి వచ్చినను—ఇంత చిన్న

విషయము నా బుఱ్ఱకు తట్టినదే కాదు సుమా', అనుచు సంతోషము తెలిపినది.

తెల్లవాఱిన పిదప నా యిల్లాలికి ధన్యవాదములు చెప్పి, దేవదాసు తన దారిని తాను బయలుదేఱినాఁడు. కాళ్లు రోళ్లగునటులు తిరిగి తిరిగి యొక పల్లెటూరు చేరుకొనినాఁడు. అక్కడ కొందఱు యువకులు బండిచక్రముల కినుపకట్లు బిగియింప యత్నించుచుండిరి. వారెంత తంటాలుపడిన నా కట్లు వారికి లొంగుట లేదు. మీఁదుమిక్కిలి యొక వైపు నుండి వారు బిగియింప, రెండవవైపునుండి కట్టు లూడి పోవుచుండెను.

ఇదేమా యని, చేరువకు వచ్చిచూడ, దేవదాసునకు వారు చేయు పొరపాటు బాగుగా నవగతమైనది.

'అన్నలారా!—మీరు చేయుచున్న పని యేమి? ఇవ్విధమున మీ రెంత కాలము శ్రమపడినను పని జరుగునా? ఏనాఁటికైన కట్లు బిగియునా? ముందు చక్రము కదలకుండ దాని నొకచో స్థిరపఱచుఁడు. అది స్థిరముగనున్నచో మీరు కట్లు సులువుగ బిగియించవచ్చును,' అని సలహా యిచ్చిన వెంటనే, తడయక ఆ యువకు లా ప్రకారమే చేసిరి. తలవని తలంపుగ, వారి పని మిక్కిలి సుకరముగ నెఱవేఱినది. ఎంత సేపటినుండియో వారు పడెడి శ్రమ యంతయు బుద్ధికుశలుఁడగు దేవదాసు మాటను పాటింపఁగా, సుసాధ్యమైనది; చిటిక సేపటిలో చక్రాలకుఁ గట్లు బిగిసినవి!

యువకులందఱు నానందాబ్ధి నోలలాడిరి. ఇటువంటి గొప్పయుక్తి చెప్పిన దేవదాసును వారా రాత్రి విడిచిపెట్ట లేదు. వారి యాదరాభిమానములను కాదనలేక దేవదాసా రాత్రి యక్కడనే గడపి, మరుసటి యుదయముననే మఱల పయనము సాగించినాడు.

పూర్తిగా నొక పగలు, ఒక రాత్రియు ప్రయాణము చేసి, దేవదా సరణ్యప్రదేశము చేరుకొనెను. అట పసుల కాపరులు కొంతమంది పశువులను మేతకోసము బీటిమీదికి వదలి, తాము చలిమంట వేసికొనుచుండిరి.

తొలుత వారు, కొన్ని యెండుచిదుగు లేఱికొని వచ్చి అగ్గిముట్టించిరి. అవి సరిగా రాజుకొనకముందే యాతురపడి పచ్చిరెమ్మలు విఱిచి పడవైచిరి. పచ్చిరొడ్డ పడినదే తడవుగ రాజుకొనియెడి చిన్న మంట కాస్తయు జల్లాఱి, పొగ వచ్చుట ప్రారంభమైనది. 'అయ్యో! నిప్పు ఆఱిపోవుచున్నదే!' యను తొందరకొలంది వారు చేతికందిన యాకులు, చిదుగులు ప్రోగుచేసికొనివచ్చి యా కుప్పపయిని పడవేసిరి. అందఱును కలిసి యూదిరి. ఇప్పుడా కుప్ప యుక్కిరిబిక్కిరి యైనది. వా రెంతగ కృషిచేసినను మఱి యగ్గి దిగనాఱినదే కాని యంటు కొనలేదు; పొగయైనను రాలేదు.

అమాయకులగు పసులకాపరుల యవస్థ చూడ దేవదాసునకు జాలి కల్గినది. 'అబ్బాయిలూ!— ఎందుకా తొందర? మొదట నా యెండుటాకులు బాగుగ మండనీయుడు. అగ్ని విజృంభించి, జ్వాల వచ్చిన తరువాత నెట్టి పచ్చిరొడ్డ

వేసినను ఫరవాలేదు. ఆహుతి యగును. అంతేకాని, యిదే మిటి? ఈ హడావుడి! చిదుగులు రాఁజుకొననీయరు; గాలి తగులనీయరు. మంట యెట్లు రగులును? మీ చలియెట్లు తీఱును?'

—ఇటులనుచు, దేవదాసా నిసుఁగులయొద్దనే కొంత సేపు కూర్చుండి, మంట చేసిచూపి, మఱల కాలుసాఁగించినాఁడు. ఇటు లింతవఱకు జరిగిన మూఁడు సంఘటనలకును తనలోఁ దా'నంతరార్థ మేమైయుండునా' యని తర్కించుకొను చుండెను. ఎంత తర్కించుకొన్నను, సంఘటనలు కన్నులకుఁ గట్టినట్టులుండెనేకాని, వాని భావము సుంతయైనను స్ఫురించి నదికాదు.

## 12. చిత్రమైన కొరకచ్చులు

ప్రొద్దు గ్రుంకువఱకు దేవదాస దేపనిగా నడచుచునే యుండెను. అట్టు లడవుల వెంబడి పోనుపోను, పర్వతముల వరుసయు, అందొక గుహయుఁ గనిపించినవి. ఆ గుహ సహజసిద్ధముగ తెఱచియుండలేదు. దానికి మన ఇండ్లకు వలెనే తలుపులు, ద్వారబంధము అమరుపఁబడియున్నవి. దేవదాసు గుహయొద్దకు వెళ్లి తలుపు తట్టెను.

'ఎవరు వారు ?' అను ప్రశ్న లోనుండి వచ్చినది.

'నే నొక మహాపాపిని. నేను మోయుచున్న పరుల పాపములకు పరిహారము చేయవలెనను సంకల్పముతో బయలు దేఱి వెళ్లుచున్నాను' అన్నాఁడు దేవదాసు.

అప్పుడు లోపలినుండి యొక యతీశ్వరుఁ డీవలకు వచ్చి, 'పరుల పాపములు నీవు మోయుచుంటినంటివే, అవి యెట్టివి ?' అని మఱలఁ బ్రశ్నించెను.

ఇందులకు బదులుగా దేవదాసు :

ఆనాఁ డడవిలో కానవచ్చిన తల్లి యెలుఁగు, దాని చిన్నారి కూనలు - వానివాని చర్యలు - భవనము చిట్ట చివరనున్న గదిలోని సింహాసనము, దానికి చేర వేసియున్న రాజదండము - అక్కడకుఁ బోవలదని దేవపిత శాసించుట, దానిని తా నుల్లంఘించుట - పొలములలోని కాఁపులు కంగారు పడి లేఁగదూడను కలవరపెట్టుట, అవ్వ పిలిచిన యొక్క పిలుపుతో నది యత్యుత్సాహమునఁ జెంగున గంతుచు నింటికి చేరుట - ఈ సంగతిసందర్భములెల్ల పూస గ్రుచ్చినట్లు వానితో మనవిచేసినాఁడు.

'శిక్షవల్ల పాపము వృద్ధియగునేకాని పరిహారము కానేరదను సత్యమును రూఢిగఁ దెలిసికొనఁగల్గితిని. మఱి, పాపము హరించు కిటుకులో యీ పాపికి బోధించి, పుణ్యము కట్టుకొనుఁడు మహానుభావా !' యని వేఁడుకొన్నాఁడు.

'సరి. ఇవేనా, నీ యనుభవములు ?' అనుచు మఱల గంభీరముగఁ బ్రశ్నించినాఁడు యతీశ్వరుఁడు.

అంతట పిన్నవాఁడు జ్ఞప్తికిఁదెచ్చుకొని,—ఇటీవలఁ దనకు తారసిల్లిన యిల్లాలి చేష్టలు, యువకుల కృత్యములు, పసులకాపరుల పనులు—వారందఱు చేయుచువచ్చిన లోపములు, వానిని సవరించి సరిదిద్దుకొనుటలో తాను వారివారికిఁ జెప్పిన సలహాలు - ఇవన్నియు నున్నవి యున్నట్టుగ మహాత్మునికి విన్నవించెను.

మునిశ్వరుఁడు తన గుహాలోనికిఁ బోయి, గొడ్డలి యొకటి చేతఁబట్టుకొని వచ్చినాఁడు. దేవదాసును దగ్గఱకు రమ్మనినాఁడు. సమీపముననే యొక చెట్టు నానవాలు చూపి, దానిని నఱకుమనెను. దేవదాసు నఱకెను. చెట్టు నేలకు వ్రాలినది. దానిని మూఁడు తుండెములుగఁ జేయుమన్నాఁడు మౌని. అటులే చేసినాఁడు దేవదాసు. అటుపిమ్మట యతి మఱల లోనికిఁ బోయి, యీసారి పిన్నవానికి నిప్పు తెచ్చి యిచ్చినాఁడు. 'ఈ నిప్పు నా తుండెములకు ముట్టించి, రాఁజఁబెట్టు. తుండెములు మూఁడును కొరకచ్చులుగా మాఱువఱకును వానిని కాల్చు'మని చెప్పెను. గుర్వాజ్ఞను తలఁదాల్చి, సరిగా నతఁడు చెప్పినటులే చేసినాఁడు దేవదాసు.

తరువాత యతీశ్వరుఁడు 'వత్సా!—ఇపుడు వరుసగ మూఁడు గోతులు త్రవ్వుము. ఆ కొరకచ్చులు మూఁడును - ఒక్కొకటి సగము భూమిలోపలను, తక్కిన సగము భూమిపైని ఉండునటులు పాఁతిపెట్టు'మని చెప్పెను. దేవదాసా కొరకచ్చులు తీసి యటులే పాఁతెను.

అప్పుడు యతీశ్వరుఁడిటులు చెప్పసాఁగెను:

'కుమారా!—అదిగో! ఆ కొండదిగువ నొక యేఱు ప్రవహించుచున్నది. చూచితివా! అందులోని నీళ్లు నీవు నోటితో పుక్కిటఁబట్టి తెచ్చి, యీ కోరకచ్చులు మూఁడిటిని తడుపవలెను. నాఁటిదిన మా యిల్లాలి కేమి బోధించితివో—ఆ మాట మనసులో నుంచుకొని మొదటి కోరకచ్చును తడుపుము. చక్రములకు కట్లు వేయఁబోయిన యువకుల కేమి యుపదేశించితివో—ఆ మాట గుర్తుంచుకొని రెండవ కోరకచ్చు తడుపుము. ఆఖరున పసులకాపరుల కేమి సలహా యిచ్చితివో—ఆ మాట జ్ఞప్తియం దుంచుకొని యీ మూఁడవ కోరకచ్చు తడుపుము. శ్రమపడి యివ్విధమున నీవీ కోరకచ్చులు తడుపుచుంటివేని—కాలక్రమమున నవి చిగిర్చి అచిరకాలముననే నీ కోరిక యీడేఱును. అనగా—మానవ కోటిలోఁగల పాపము పరిహరింపఁజేయు టెటులో యా మార్గము గోచరించును. దానితోఁబాటు నీవు చేసిన పాపములకుఁగూడ ప్రాయశ్చిత్తము కల్గును'.

ఇట్లు చెప్పి, యతీశ్వరుఁడు తన గుహాలోపలకు మరలి పోయెను. ఎంత యాలోచించినను, ముని పలుకులలోని భావము దేవదాసు బుద్ధి కెంతమాత్రము స్ఫురించలేదు. అందుచే నతఁడిఁక యర్థము తెలిసికొనుటలోఁ గాలహరణము చేయక, యతిబోధల నక్షరాల నాచరించుటకే యుద్యుక్తుఁడాయెను.

# 13. దొంగవాని మిడుకుతనము

దేవదాసు నదికిఁ బోయి, నోటినిండుగ నీళ్లు పుక్కిటఁబట్టి తెచ్చి, కొరకచ్చులు తడిపినాఁడు. ఆ కొలఁదిపాటి నీళ్లతో తడిపినంతమాత్రాన మూఁడు కొరకచ్చులు తడియుట సాధ్యమా? అందునను పుక్కిటఁబట్టి తెచ్చెడి జలమేమాత్రముండును? అందుచే దేవదాసు మఱల మఱల నదికి పోవుచు వచ్చుచు, నటులే నోటినిండ నీళ్లుపట్టి తీసికొని వచ్చి, కొరకచ్చులు తడుపుసరి కతని కలసటయు, నా యలసటతోఁబాటుగ ఆఁకలియు ప్రారంభమైనవి.

ఆ నట్టడవిలో రమ్మని పిలిచి యాఁకలి తీర్చువా రెవరు? 'ఇఁక నిది పనికాదు; మోమోటము విడిచి, యేదయినను తినుటకు పెట్టుఁడని యా యతీశ్వరునే యడిగెదను' అని నిశ్చయించి, పిన్నవాఁడు తిన్నఁగా గుహకు బయలుదేఱినాఁడు. అతఁ డచ్చోటు చేరుసరికి గుహాద్వారము తెఱచియేయున్నది. అందుచేత, దేవదాసు పిలువనక్కఱలేకయే లోపలఁ బ్రవేశింపఁగల్గెను.

ఇప్పుడు దేవదాసు పోయిచూడఁగా, యతీశ్వరుఁడు ఒక ఱాతితిన్నెపయిన పండుకొనియుండెను. ఆయన గాఢనిద్రలో నుండియుండునను తలంపుతో, మౌనిని లేపుటకు దేవదాసు సాహసింపలేదు. సమీపముననే యెండిన ఫలములు కొన్ని కంటఁబడగా, వానిని భక్షించి దేవదాసు కొంతవఱకు క్షుద్బాధ నపనయింపఁజేసికొనెను.

అటు లెంతతడవు కనిపెట్టుకొనియున్నను యతీశ్వ
రుఁడు కదలక మెదలక యుండుటగని, దేవ దాసాతని చేరు
వకు వెళ్లినాఁడు. అతనిని పట్టిచూడ నిఁకేమున్నది? దేహము
లోని 'హంస' ఎప్పుడో యెగిరిపోయినది! నిన్న చూచిన
మహాత్ముఁడు నేఁడిటుల నిర్యాణము చెందుటతో చిన్నవాని
సంభ్రమాశ్చర్యముల కంతులేకపోయినది.

రాత్రిపూఁట యంతయు గుర్వాజ్ఞ ప్రకారము, కొన
కచ్చులు తడపుటతోనే యతనికి సరిపోయినది. అందుచేత,
తెల్లవాఱఁగనే యతీశ్వరుని సమాధిచేయు నుద్దేశముతో,
పాఱ పలుగు పుచ్చుకొని యొక గొయ్యి తీసినాఁడు.

సరిగా దేవదాసు గోయి తీయుట పూర్తియగు సమ
యమున, యతీశ్వరునియొద్ద నుపదేశములు పొందుటకు వచ్చెడి
శిష్యులందఱును పాలు, ఫలములు పట్టుకొని మామూలు
గా వచ్చిరి. తమ గురువు పరలోకగతుఁడైన వార్త వారికి
పిడుగుపాటుగఁ దోఁచినది. అందఱును నిస్తబ్ధులైరి; విస్మయ
మందిరి; విచారించిరి. ఆ యాకస్మికమరణమును గుఱించి
వారు పలువిధముల వేదాంతపరములగు వ్యాఖ్యలు
చేయసాగిరి.

'వాన రాకడ, ప్రాణము పోకడ తెలియరావుకద!'
అన్నాఁడొకశిష్యుఁడు. 'మనుష్యుని మంచితన మెప్పటికైనను
మరణకాలమందు చూడవలెనని పెద్దల వాక్యము. ఇది మన
గురువర్యులపట్ల సార్థకమైన' దనినాఁడు మఱియొక శిష్యుఁడు.

'ఆగతము ననాగతమును సంపూర్ణముగ నెఱిఁగిన సర్వజ్ఞులు మనగురువుగారు! అందువలననే, అలనాఁటి భీష్ముల వారివలె తమ యనంతర మాయన యాశయములు ప్రబోధించి పేరు నిలువఁబెట్టుటకని ప్రియశిష్యుని నియమించి స్వచ్ఛందమరణము పొందినారు. ధన్యులు! తరించినారు!!' అనుచు ఇంకొక శిష్యుఁడు తన యభిప్రాయము వెల్లడించినాఁడు.

ఇట్టి ప్రసంగముల మధ్య యతీశ్వరుని కళేబరము సమాధి కాఁచఁబడినది.

అటు తరువాత నా శిష్యబృంద మెల్లరు దేవదాసు వైపు తిరిగి—'మహాత్మా! లోకమునకు వెలుఁగు చూపఁగల మీవంటి యుత్తమశిష్యుని మాకు గురునిగా నియమించి, మా మునీశ్వరుఁడు విష్ణుసాయుజ్యమును జెందెను. మాకు వారి యందుండెడి యా శ్రద్ధాభక్తులతోనే యింతటినుండి మేము మిమ్ములను యథాశక్తి పూజించి, సేవించుచుందుము. తామీ గుహాలోనే గురువుల స్థానము నాక్రమించి, మమ్ముల నావరించియున్న యజ్ఞానాంధకారమును విరియఁగొట్టు చుండవలెనని ప్రార్థించుచున్నాము. తామిక్కడనే కాలక్షేపము చేయవచ్చును. అడుగు కదపనక్కఱలేదు. మా భక్తికొలఁది పాలు, ఫలములు తెచ్చి సమర్పించుకొనుచుందుము. గురువర్యుల కేమి కావలసినను కాకిచేఁ గబురంపినఁ జాలును. మీ శిష్యకోటికిఁ జెందిన మేము దానిని తెచ్చియిత్తుము. అందఱము చేతులుకట్టుకొని మీయానతి నెఱవేర్చెదము కాన,

తామీ పదవి నలంకరించి, మాకు ముక్తిమార్గము చూపి మమ్ము తరింపఁజేయవలసిన భారము మీదే' అనుచు విన్నవించుకొనిరి.

నాఁటినుండియు దేవదాసు యతీశ్వరుని స్థానమాక్రమించి, శిష్యవర్గము అర్పించెడి ఫలాహారములతో మనుగడఁ గడపుకొనుచు, వారి ముక్తిమార్గముకొఱకు తనకుఁ దెలిసిన విషయముల నుపదేశించుచుండువాఁడు. ఒకవంక యీ యుపదేశములు కావించుట, మఱొకవంక గుర్వాజ్ఞ ననుసరించి నదీజలము పుర్రెటఁ బట్టి తెచ్చి, కొరకచ్చులు మూఁడింటిని తడుపుచుండుట—ఇవియే యాతని నిత్యకృత్యములైనవి.

ఇవ్విధముగ నొక వత్సరము గడచునప్పటికి దేవదాసు కీర్తి దేశదేశములకు వ్యాపించినది—'ఫలాని యరణ్యప్రాంతమున — కొండగుహలో నొక మహానుభావుఁడు నివసించుచున్నాఁడు. ఆత్మ పవిత్రతకోసమని యాయన ప్రతిదినము నదీజలము పుర్రెటఁ బట్టి తెచ్చి మూఁడు కొరకచ్చులను తడుపుచున్నాఁడు' అను నీ సత్యమునకు చిలవలు పలవలు అల్లి, లోకులు వేర్విధములగు వింత కథలను చెప్పుకొని యానందించుచుండిరి.

ఏమైననేమి; దేవదాసు మహిమలనుగూర్చిన గాథలు వాయువేగమున వ్యాప్తిచెందుటతో శిష్యవర్గము పదులు, వందలు దాఁటి, వేల సంఖ్యలోఁ బడినది. మోక్షాకాంక్షితులగు శిష్యులలో పేద సాద, దొంగ దొర—అను విభేదమునకు తావులేకుండ సంఖ్య వర్ధమానమగుచుండెను. అందు

శ్రీమంతులైన శిష్యులు భక్తికొలఁది యమూల్యములు, నపూర్వములు నగు కానుకలు కొల్లలుగఁ దెచ్చి గురువునకు సమర్పించుచుండిరి.

కాని—ఆ కానుకల విలువనుగురించి దేవదాసునకు ప్రమేయమే లేకుండెను. ఏమన ?—శిష్యులర్పించెడి కానుకలలో దేవదాసు, తన యసువులు నిలుచుట కగత్యమైనంత వఱకే స్వీకరించుచు, తక్కిన దెల్ల గురుప్రసాదముగ, నక్కడ సమావేశమైన వారికెల్లరకును పంచిపెట్టుచుండెను.

ఇప్పు డీ యపారమగు శిష్యకోటికిఁ దరణోపాయము చూపుటలోను, తన్నాశ్రయించిన భక్తవర్గమున కుపదేశము లొసఁగుటలోను, తనదీక్ష ననుసరించి నోటితో ఏటినుండి జలము తెచ్చి కొరకచ్చులు తడుపుటలోను, దినములోని యిరువదినాల్గు గంటలు నతనికి సరిపోకుండెను.

'ఇటులే నేను జీవితము గడుపుట పరమేశ్వరుని సంకల్పమా ? నా గురూత్తముని యుద్దేశమా ? ఈ విధముననే నా పాపములు నశించి, మోక్షప్రాప్తి కల్గునా ?' అని, దేవదాసు తనలోఁ దాను తలపోయుచుండెను.

ఈ దేశికపదవి ప్రారంభమై దేవదాసున కొక వసంతము గడచి, రెండవ యేఁడుకూడ మొదలిడినది. పూర్తి కావచ్చినదికూడ. ఈ రెండేండ్లకాలములో నొక్కనాఁడైన మానక, యతఁడు శ్రమపడి కొరకచ్చులు మూఁడును తడుపుచునే యుండెను. ఐనను, గురువైన యా యతీశ్వరుఁడు

సూచించినటుల అందొక్కటియు మొలకెత్తలేదు. చివరకు చిగిరించనైనలేదు.

ఒకనాఁడు వాడుకచొప్పున దేవదాసు తన గృహంలోఁ గూర్చుండియుండగా, బయటినుండి చిత్రముగు నలికిడియైనది. అది యెవ్వరో గుఱ్ఱమెక్కి యుల్లాసముగఁ బాడుకొనుచు వచ్చుచున్న యలికిడి! ఈ మహానుభావుఁ డెవ్వఁడైయుండునా. చూచివత్తమను కుతూహలముతో దేవదాసట్టె యొక్కపరి యీవలకు వచ్చినాఁడు.

అతఁడొక చిద్విలాసపురుషుఁడు! వైఖరి చూచిన నతఁడొక శూరుఁడా లేక వీరుఁడా యని యనిపించును! అతనిలో ఉత్సాహము ముఱుకలు వేయుచున్నది. అందాలు చిందెడి వాని దుస్తుల ముస్తాబు పరికించితిమా, అతఁ డొక రాజపుత్రుఁడా యని తోఁచును. ఇఁక, నా యువకుఁ డెక్కికూర్చున్న పంచకల్యాణి గుఱ్ఱమా!—విలువఁ గట్ట వీలులేని యలంకారములతో ప్రకాశించుచున్నది !!

దేవదాసతనిని పలుకరించినాఁడు.

అతఁడు ఠీవితో నాఁగినాఁడు.

'నీ వృత్తి యేమి ?' అని యడిగిన దేవదాసు ప్రశ్నకాతఁ డిట్లు బదులు చెప్పినాఁడు : 'నేను దొంగను. దోఁపిడీకాఁడను. ఒంటరిపాటుగ నిటులే స్వారి చేసికొనుచుఁబోయి. త్రోవలుకాచి, దారిపోవు పథికులను దోఁచుకొనెదను. మెచ్చుమాటలు చెప్పెడి పెడసరపుఁ గొయ్యలను—ఇదిగో, యీ కత్తికి బలిచేసెదను. ఎక్కువ ధనసంపద దొరకుటకంటె

ఎక్కువమందిని చంపఁగలిగిన నాకు మిగుల నుల్లాసముగ నుండును.'

ఈ ప్రత్యుత్తరమునకు దేవదాసు నిర్విణ్ణుఁడై నాఁడు. ఆతని మనస్సు పరిపరి విధములఁ బరుగులెత్తినది.

'అరే!—ఏమీ దుర్మార్గుఁడు! ఎంతటి సాహస ప్రసంగము!—ఇటువంటి మహాపాతకు నింతదనుక జీవితములోఁ జూచి యెఱుఁగను. వీనికి పాపపరిహార మనున దున్నదా? వీఁ డెట్టి దుర్గతికిఁ బోవునో కదా!— నా శిష్యగణమంతయు తమంతతాము వచ్చి, 'చతుస్సాగరపర్యంతము' చెప్పుకొని, 'మహాత్మా!- మేము ఫలాని పాపకృత్యము లొనరించియుంటిమి. అవి పోఁగొట్టి, మేము తరించు మార్గము చూపుఁడు!' అనుచు, మాయ - మర్మము, కల్ల - కపటము లేకుండ విన్నవించు కొందురు. ఉట్టివారి విషయమున నేదేని త్రోవ యోచింప వీలగును. కాని...వీఁ డేమి? వీని దురహంకార మేమి? చేతులార ఘోరమగు మహాపాపములు, హత్యలు చేయుటయే గాక, తన చేష్టలను గొప్పగ వర్ణించుకొనుచున్నాఁడు, దురాత్ముఁడు! ఎంత ఎక్కువమందిని చంపిన, నంత యుల్లాసముగ నుండునఁట!! ఏమి విడ్డూరము!!!—' అనుచు న దేపనిగ వానింగూర్చి తలపోయసాగెను.

ఎంత యత్నించినను ఆ దొంగవాని దివ్యస్వరూపము దేవదాసు దృష్టినుండి మఱలకుండెను; పిడుగులవంటి వాని పలుకులు చెవులలోఁ బ్రతిధ్వనించుచునేయుండెను. దొంగవాఁడు చెప్పిన సమాధానము విన్నపిమ్మట దేవదాసునకు

మాఱుప్రశ్న వేయ మనస్కరించినది కాదు. కావున నాలో చనామగ్నుఁడై యతఁడు తన గుహను చేరుకొనెను.

ఇప్పుడు దేవదాసు మనస్సెంతగాఁ గలవరము చెందెనో, మాటలతో వివరింపలేము.

"ఈ దొంగవాఁడు గుఱ్ఱముపై నెక్కి వచ్చి యీ ప్రదేశమున సంచరించినట్లయిన, నిచటి ప్రజలందఱు భయభ్రాంతులగుదురే? నేనేమి చేయవలయును? ఈ భీతిచే వారిల్లు కదలి నా యుపదేశములకొఱకు వచ్చుటే మానివేసెదరేమో!—మఱి, వారు నా కడకు రాకున్నచో, వారి పాతకములు హరించు టెటులు? ఎంతటి ప్రమాదము వాటిల్లినది! దీని కేమి?—ఇంతకు మించిన ముఖ్యవిషయ మొకటికలదు—శిష్యులు నాయొద్దకు రాకుండిరేని, ఇఁక నా జీవనము గడచు టెట్లు?—" అని యాతఁడు తీవ్రమగు నాలోచనలో పడెను.

పోఁబోవుచున్న దొంగ నట్టె యాఁగుమనినాఁడు దేవదాసు.

"అబ్బాయీ!—ఇంతమంది మానవులు నాయొద్ద కేల వచ్చుచుందురో తెలియునా? 'మే మిటువంటి పాపములు చేసితిమి, అటువంటి పాపములు చేసితిమి' అని గొప్పలు చెప్పుకొనుటకుఁగాదు. 'తెలిసియో తెలియకయో ఫలానా పాపములు చేసితిమి. మమ్ము క్షమించి, ముక్తిమార్గము చూపుఁడు, మహానుభావా!' అను మనఃపూర్వకమగు పశ్చాత్తాపము వెల్లడింప వచ్చెదరు. నీ కేపాటియైన పాపభీతి, దైవభీతి ఉండెనేని, ఆ శిష్యు లందఱివలె నీవును నీ పాపములను

దాఁపఱికము లేకుండ పేర్కొనుము. తరణోపాయము [illegible]'' నని యతనితో చెప్పెను.

ఈ మాటలకు దొంగవాఁడు పకపక నవ్వెను.

'ఓయీ వెఱ్ఱివేదాంతీ!— నాకు దేవుని భయము సుంతయైన లేదు. నీ ధర్మోపదేశములతో నా కెంతమాత్రము పని లేదు. నాకు నీవు యజమానుఁడవు కావు. కనుక, నీమాట నేను వినను. ధర్మబోధలు చేసి నీవు కాలక్షేపము చేయుచున్నావు; దొంగతనమువల్ల నేను జీవనము గడుపుచున్నాను. నీ వ్యాపార మది; నా వృత్తి యిది. జన్మమెత్తిన ప్రతిజీవియు ఏదో యొక విధమున పొట్టపోసికొనవలెను గద! కావున, నీ ధర్మబోధము లన్నియు నిన్నాశ్రయించెడి శిష్యకోటికి చెప్పుకొనుము. నా కేమియుఁ జెప్ప నక్కఱలేదు.

'నీవు నా కిప్పుడు దేవునిగుఱించి జ్ఞప్తి చేసితివి గనుక, రేపటి రోజున మఱి యిద్దఱ నధికముగ నా కత్తికి బలి చేసెదను. ఈ క్షణమందే నిన్ను పరిమార్చవలసినది. కాని, చేతులు మలినము చేసికొన మనస్కరింప లేదు. నన్ను గుఱించి మఱెన్నఁడును తలఁపక, నీ గొడవ నీవు చూచుకో, పో!—' అనుచు కఱుకుపలుకులతో వాఁడు దేవదాసును హెచ్చరించెను.

ఈ హెచ్చరిక చేసి దొంగవాఁడు తన గుఱ్ఱమెక్కి వెడలిపోయెను. తరువాత వాఁడు మఱెన్నఁడును దేవదాసు కంటఁబడ లేదు. అందుచేత, వాని యుదంతమే విస్మరించి,

దేవదా సెప్పటివలెఁ బ్రశాంతముగఁ గాలక్షేపము చేసికొను చుండెను. ఇటుల, దేవదాసు జీవితకాలములో మఱి యెనిమిది వత్సరము లతనికిఁ దెలియకుండఁగనే గడచిపోయినవి.

# 14. పునర్దర్శనము

ఒకనాఁటి రాత్రి వాడుకప్రకారము, దేవదాసు కొరక చ్చులు మూఁడింటిని తడిపివచ్చి, విశ్రాంతికొఱకు గుహకు మఱలెను. తనకొఱ కనుదినము వచ్చెడి శిష్యబృందము వచ్చునుకదా యని, యెదురుసూచుచుఁ గూర్చుండెను. ఎంత సేపు నిరీక్షించినను, నాఁడు పగలెల్ల ఒక్క పిట్టయయిన వచ్చి వ్రాలలేదు.

సాయంకాలమగువఱకు దేవదా సటులే వారికొఱ కొంటరిగ కనిపెట్టుకొనియుండెను. ప్రాణము విసిగినది. ఇఁక వారి మాట యటుంచి, తన జీవితమునుగుఱించి తలపోయఁ గడంగెను. ఇంతలో నా దొంగవాఁడు తలఁపునకు వచ్చి నాఁడు. "అన్నటులు, వాఁ డేమనినాఁడు ?—'ధర్మోపదేశ ములు చేసికొని నీవు కాలక్షేపము చేయుచుంటివి. దొంగ తనమువలన నేను పొట్టపోసికొనుచున్నాను. నీ వృత్తి యది. నావృత్తి యిది, అంతియ వ్యత్యాసము...' అనికదా !"

'బాగుగా యోచింపఁగా, నీమాటలు పరమసత్యములే యని యనిపించుచున్నవి' అనుకొని, దేవదాసు మఱల గత జీవితము నంతటిని తిరుగఁదోడినాఁడు.

'లేదు. నా గురుదేవుఁడు చెప్పిన విధమున నేను జీవితముఁ గడపుటలేదు. ఆ మహానుభావుఁడు నాకు తపోనిష్ఠను విధించి యుండెను. కాని, యీ పవిత్రమగు నిష్ఠను నా యైహికభోగములకొఱకు వినియోగించుకొనుచున్నాను. ఆయన నా కిచ్చిపోయిన తపోధనమువలననే నా కింత శిష్యవర్గ మేర్పడినది. దానివలననే నా మనుగడ సుఖముగ సాగిపోవుచున్నది. నా యశశ్చంద్రికలు మిన్ను ముట్టుటకు నిదే కారణము! శిష్యగణము భక్తిమెయి నన్నాశ్రయించినకొలఁది, నాకు మిక్కుటముగ సహాయము లమర్చినకొలఁది, నాకు శారీరకసౌఖ్యముపై మమత హెచ్చినది. అహంభావమనెడి కలుపు నామనస్సునందు పెరిఁగిపోవుచున్నది. అందుచేతనే, యొక్కపూఁట నాశిష్యబృందము కానరాకపోవుసరికి మనస్సు తహతహలాడిపోవుచున్నయది. వారు వచ్చి కంటఁబడుసరికి హృదయముప్పొంగిపోవుచున్నది. ఎందుచేత ?—వారు నా ఘనతను గూర్చియు, నే నాక్రమించిన పవిత్రస్థానమును గుఱించియు వేవిధముల వినుతించుచుందురు, గనుక.

'కాని—ఇవ్విధమగు జీవితవిధాన మొంతమాత్రము కూడనిది. కేవలము నింద్యమైనది. కీర్తికాంత నన్ను లోభపెట్టి, పెడదారిని బట్టించినది. తొలుత సంకల్పించినట్టుగా

నేను నా మునుపటి పాతకముల పోఁగొట్టుకొన లేకపోయితిని సరికదా, క్రొంగ్రొత్త దొసఁగుల కొడికట్టుచున్నాను.

'ఇఁక నిట్లొనర్చుట సరికాదు. ఇంతవఱకు నాకుఁ బరిచితమై యున్న శిష్యకోటికి కనఁబడకుండపోవుట యొక్క సంగత్యంతరము. నా కర్తవ్యము ఫలింపవలెనన్న, కాకుఁలు దూఱని కాఱడవిలో క్రొత్తయాశ్రమ మేర్పఱచుకొనవలెను. ఇప్పుడయిన బుద్ధి తెచ్చుకొని, గత పాపపంకిలమునుండి బయటపడి, మఱి క్రొత్తతప్పులు చేయకుండుటకు యత్నింపవలెను. అటులే చేసెద'ననుచు, దేవదాసు తన జీవితవిధానమును మార్చుకొనితీరెదనని దృఢనిశ్చయము గావించుకొనెను.

ఇట్టి నిశ్చయముతో దేవదాసు, తినుబండారములు ఉంచుకొను చిన్న చేతిసంచిని, ఒక పాఱను దీసికొని గుహావదలి పోయెను. పోయిపోయి, యతఁడు జనసంచారములేని యొక స్థలము చేరుకొని, నరునికంటఁ బడకుండుటకై తన నివాసము కొఱకు మఱియొక గుహ నేర్పఱచుకొనినాఁడు.

చెప్ప మఱచితిని. సంచియు, పాఱయు చేతఁబుచ్చుకొని సాగిపోవుచున్న దేవదాసునకు తలవని తలంపుగ నొక చిత్రము సంఘటిల్లినది:—భీమమైన చొరరాని యేకాంత స్థలము నెన్నుకొనఁగల్గితిననుకొని, దేవదాసు తన ప్రజ్ఞకు మురిసిపోవునంతలో, మఱల గుట్టమీఁది దొంగ తారసపడినాఁడు.

అతఁడు 'ఎక్కడికయ్యా, వేదాంతీ!—'అని ప్రశ్నవైచెను.

'సంఘములో మెలఁగుట పాపకారణమని గుర్తించితిని. ఎవరి కంటను బడని యేకాంతప్రదేశమున నెలవు నేర్పఱచుకొనఁదలఁచితి'నని దేవదాసు బదులిడెను. ఈ పలుకులు దొంగ నాశ్చర్యసాగరమున ముంచినవి.

'భేష్, బాగుగ నేయున్నది వ్యూహము. శిష్యకోటి నీ యొద్దకు రాకున్న, జీవము లెటుల నిలుచును? జీవనోపాధి?' అని మాఱుఁ బ్రశ్నించినాఁడు దొంగ.

ఇప్పటివఱకు దేవదాసునకు తన తిండిసమస్యను గుఱించిన తలంపే లేకపోయెను. కాని, దొంగ యీ మాట యెత్తఁగనే, యతని కా సంగతి జ్ఞప్తికి వచ్చినది.

మఱేమియు ననక, దొంగ తనదారిని స్వారి చేసికొనుచు పోఁబోయెను.

అప్పుడు దేవదాసుదృష్టి మఱల నా దొంగపై ప్రసరించెను: 'ఇంతకు, నీ దొంగవాని తరణోపాయమును గుఱించి నేనేమియుఁ జెప్పనే చెప్పనైతిని. ఇదివఱకువలెఁ గాక, యీ నాఁడెంతో మర్యాదతో నితఁడు సౌమ్యముగ మాటాడినాఁడు. 'కొట్టెద'ను 'చంపెద'ననుచు మునుపటివలె నుఱుకలు వేయలేదు. ఆ దుడుకుతనము, ఆ బెదరింపులు లేవు. బహుశః, ఇప్పటికి వాఁడొకింత పశ్చాత్తప్తుఁడై యుండును' అనుచు, వాని చర్యలనుగూర్చి యనుకూలమగు ధోరణిలో నాలోచన సాగినది.

ఈ విశ్వాసముతో నతఁడు, పోఁబోవుచున్న దొంగను కేకవేసి వెనుకకుఁ బిలిచెను. 'ఏమైననుసరే, నీవు నీపాపము లకుఁ దగిన ప్రాయశ్చిత్తము పొంది తీరవలెను. ఇది దేవుని యాజ్ఞ! ఉల్లంఘింప వలనుపడదు' అని చెప్పెను.

దేవదా సిటులనఁగనే, దొంగవాఁడు గుఱ్ఱమును వెను కకు మళ్లించి. చఱ్ఱున మొలనుండి కత్తిదూసినాఁడు. దేవ దాసు బెదరి, హడలిపోయి, యడవిలోనికి కాలికొలఁది పరుగు లెత్తినాఁడు.

భయముచే దేవదాసు పాఱిపోయెనేగాని, దొంగవాఁ డతనిని వెంబడించలేదు. చెక్కుచెదరని ధీమాతో, 'ఓయీ వెఱ్ఱివేదాంతీ!—ఇది రెండవసారి నిన్ను క్షమించివదలుట! మఱల నింకొకపరి ఇట్టి బోధలు నాకు చేయఁబూనితివా, చూచుకో, నీ పని యేమగునో! ఈ పదునుకత్తితో నీ తల నూఁడ్చివైచెదను. తప్పదు...' అనుచు నా దొంగ యతనిని మందలించి, దౌడు తీసినాఁడు.

ఆనాఁటి సాయంకాలము దేవదా సెప్పటివలె కొర కచ్చులు తడపుటకు వెళ్లి చూచి ఆశ్చర్యచకితుఁడైనాఁడు. ఏమి?—ఇంతదనుక నెట్టిమార్పును చెందని యా కొఱకచ్చులు మూఁడిటిలో నొకటి చిగుర్పనారంభించినది! పరీక్షించిచూడఁగా నందుండి యొక రేఁగుమొక్క మొలకెత్తుటను దేవదాసు కాంచినాఁడు. దీనికి అతఁ డమితముగ నబ్బురపడినాఁడు.

# 15. ఘోరదృశ్యము

ఈ విధముగా దేవదాసు నరుని కంటఁబడకుండ నొంటి వాఁడుగ నరణ్యములోఁ గాలక్షేపము చేయుచుండెను. అతనియొద్ద నుండిన భోజనపదార్థము లన్నియు నయిపోయినవి. ఇప్పుడతఁడు మునుపటివలె 'శిష్యులేమియు తీసికొని రాలేదే. ఎట్లు గడచును?' అని బెంగ పెట్టుకొనలేదు. వారికొఱకెన్నఁడు నెదురుచూడను లేదు.

అతఁడు పూర్వకాలపు మన ఋషుల పద్ధతి నవలంబించి, 'అడవిలో లభించు కందమూలఫలాదులతోనే కడుపు నింపుకొని, జీవములు నిలఁబెట్టుకొందును' అని నిశ్చయించుకొనెను.

ఇట్టి నిశ్చయముతో నతఁడు బయలుదేఱి నాలు గడుగులు వేసెనో లేదో, యొక వింతదృశ్యము కానవచ్చెను. అది ఏమన-దారిలో నొక చెట్టుకొమ్మ కొక సంచి వ్రేలాడుచుండెను. 'అది యేమో' యని దేవదాసు దానిని తీసి చూడఁగా నం దతనికి సరిపడు నాహారపదార్థములున్నవి. 'ఇదేదో దైవమాయ!! లేకున్న నరుఁడు చొరరాని యీ నిర్జనారణ్యమేమి! ఇందివ్విధమున దివ్యములగు భోజన పదార్థము లమర్పఁబడుట యేమి!!' అని విస్మయమందెను. ఎవ రైన వచ్చెదరేమో యని కొంతతడవు వేచియుండెను. ఎవ రును రాకుండుట, తనకు తీరని యాఁకలి యగుట-ఈ రెండు

హేతువులను బురస్కరించుకొని, 'యేమైన కానిమ్ము' అని ముందు, సంచిలోని పదార్థము లారగించి, క్షుత్తు వాపుకొనెను.

నాఁటినుండి ప్రతిదినమును, దేవదా సాహారము కోసమై యడవిలోనికి బయలు దేఱినపుడెల్ల నా చెట్టుకొమ్మకు సంచి వ్రేలాడుచునే యుండెడిది. ఇఁక నిప్పుడు దేవదా 'సిద్ధి దైవము తనకొఱకు చేసిన యేర్పాటే' యని నమ్మి, మఱి సంశయింపక సుష్ఠుగ భోజనము చేయుచుండెను. ఏనాఁటి కానాఁ టిట్లు భోజనపదార్థము లమరుపఁబడుటతో నతని కాహార సమస్య తీరిపోయినది. మానవున కాహారసమస్యయే తీరినచో, మఱి తాపత్రయమే లేదనవచ్చునుగదా!

కాని—దేవదాసున కింతకు మించిన చింత మఱి యొకటి పట్టుకొన్నది: అది యేమన; ఆ దొంగ తలఁపునకు వచ్చినంత మాత్రమున కలిగెడి భీతి! అడవిలో నేదైన నలికిడియైన సరి, 'దొంగవాఁడు వచ్చుచున్నాఁడు కాఁబోలు' నని దేవదాసు దాఁగికొనును.

'అయ్యో బాబో!—కంటఁబడిన చాలును! ఆ దురాత్ముఁడు కత్తిదూసి నన్ను చంపివేయును. ప్రాణములే పోయిన తరువాతఁ బాపపరిహారమునకు - మోక్షసాధనకు నవకాశ మెక్కడ?' అనుకొని, దేవదాసు విచారించువాఁడు. ఇట్లు దేవదాసు జీవితములో మఱి పది వర్షములు గడచినవి.

ఇంతకుముందు చెప్పినట్టుగా, అతఁడు పాఁతిపెట్టిన మూఁడు కొరకచ్చులలో నొక్కటిమాత్రమే చిగిర్చి, యం దుండి రేఁగుమొక్క మొలిచి వృద్ధిపొందినది. తక్కిన

గొరకచ్చులు రెండు నెదుగు బొదుగులుకాని, ఎట్టి మార్పులు గాని లేక, యటులే, పాఁతినవి పాఁతినట్టుగ నే యుండిపోయినవి.

ఒకనాఁడు దేవదాసు పెందలకడనె లేచి, తన పనులు చూచుకొనఁ బోయినాఁడు. ఎప్పటియటుల గొరకచ్చులు మూఁడిటిని తడిపి, యలసటచే నొకింత విశ్రమింతమని యక్కడనే కూర్చుండినాఁడు. అప్పు డతని మానసమున నొక జిజ్ఞాస రేఁగినది: 'నేను పాపములు సల్పితిని.సల్పిన పాపములు పోఁగొట్టుకొన యత్నించుచుంటి. కాని, నా కిప్పుడు చావనిన భయము పట్టుకొన్నది. బ్రతికియున్నపుడే పాతకహరణో పాయము చూచుకొనవలెను కాని, చచ్చిన తరువాత చేయఁ గలదేమి? కనుక, ఇపుడే నేను పాపముల పరిహారము చేసి కొని, ముక్తిమార్గము నారయవలెను. లేదేని, చచ్చిన తరు వాతఁగూడ చేసిన పాపములు వెంటనంటి, ప్రతి జన్మ మందును పీడించుచునేయుండును' అను తీవ్రాలోచన మాతనిని బాధింపసాగినది.

ఇట్టి యాలోచనలో మరల నొకింత ధైర్యము తెచ్చు కొని యతఁడు 'భగవంతుని అనుగ్రహమే యున్న యెడల, చచ్చినను కరుణించఁగలఁడు. దేవుని కరుణయే యున్నచో ఏదో యొక విధమున పాపవిముక్తి కలిగియేతీరును. కావున, నీ కళేబరము రూపుమాసినంతమాత్రాన ముక్తిమార్గమున కవరోధములేదు. అందుచేత చావునుగుఱించి నేనేల భయ పడవలెను ? ఊహుఁ - భయపడను. ఆ దొంగ వచ్చిన రానీ.

కత్తిదూసి నన్ను చంపినను చంపనీ. నాకు భయము లేదు, ఎంతమాత్రము లేదు.' అని మనస్సు దృఢపఱచుకొనెను.

ఈ యాలోచన దేవదాసు మనస్సున మెఱపువలె మెఱసినంతలో దొంగవాఁడు వచ్చుచున్న సవ్వడి యైనది. అపుడు దేవదాసు మనస్సున మఱల నింకొక యాలోచన పొడమినది: 'ప్రభుని యాజ్ఞ లేనిది చీమయయినను కుట్టదు. మంచిగాని చెడుగుగాని ఏదయిన నా దేవదేవుని యాజ్ఞవలననే జరుగవలెను. అంతియకాని, దైవసంకల్పము లేనిదే ఒకనికి మఱియొకఁ డెట్టి యపకారము చేయఁగలఁడు?-' ఇటులనుకొని, దేవదాసు ధైర్యముతో దొంగయెదుటికి వెళ్లినాఁడు.

ఇప్పుడు వచ్చినది దొంగ యొక్కఁడే కాఁడు. ఆతని గుఱ్ఱమునకు వెనుకతట్టున నొక వ్యక్తి కలఁడు. వాని చేతులు వెనుకకు విఱిచికట్టి బంధింపఁబడినవి. నోట గుడ్డలు క్రుక్కఁబడినవి. ఆ వ్యక్తి కిక్కురుమనక, ఏమన్నను మౌనము దాల్చి యుండెను. దొంగ యా వ్యక్తిని ఏదో 'చెప్పెదవా? లేదా?' యని దండించి, బాధించుచుండెను.

దేవదాసు దొంగయొద్దకు వచ్చి గుఱ్ఱమున కెదుట నిలువఁబడినాఁడు. 'వీని నెక్కడికి తీసికొని పోవుచున్నావు? ఎందు కిట్లు హింసించుచున్నావు?' అని యడిగినాఁడు.

'అరణ్యములోనికి. వీఁడొక శ్రీమంతుఁడగు వర్తకుని కొడుకు. తండ్రియాస్తి నెక్కడ దాఁచెనో గుట్టు చెప్పుమనిన చెప్పకున్నాఁడు. ఉండుము. నిమిషములో వీనిచే చిలుకపలు

కులు పలికించెద !...' అనుచు, దొంగ తన దారిని తాను పోఁబోయెను. కాని, దేవదాసు దొంగను పోనీయలేదు. గుఱ్ఱపు కళ్లెము పట్టుకొని, యడ్డు నిలిచెను.

'ఇతనిని వదలివేయుము. వదలెదవా? లేదా?' అని దేవదాసు గద్దించెను.

దొంగ యుగ్రుఁడై, కత్తిదూసినాఁడు. 'వానితోపాటు నీకును శాస్తి కావలెనా యేమి? ఇటు లనావశ్యముగఁ గలుగఁజేసికొంటివేని, నిన్ను యమపురికిఁ బంపెదనని మునుపు చెప్పియుంటినే, జ్ఞప్తిలేదా ? నీ పని నీవు చూచుకో. పో,పో. నా దారిని నన్నుపోనీ, పిచ్చివేషములు వేయకు'మని యుఱుముటిమినట్లు జవాబు చెప్పినాఁడు.

ఈసారి దొంగ బెదరింపులకు దేవదాసు సుంతయైనను జడియలేదు.

'నిన్ను కదలనీయను. నీవు నన్ను నఱకుము, చంపుము. నాకేమియు భయములేదు. నిస్సహాయులు విచ్చలవిడిగ వదలఁ గూడదని, నీదుర్నయములు దుష్టచేష్టలు సాగనీయవలదని పరమాత్మ నాకు హృదయములో చెప్పుచున్నాఁడు. విడువుము. ఈతనిని విడిచిపెట్టు' మనుచు, దేవదాసు శాసించినాఁడు.

తన కిష్టములేకున్నను, సణుగుకొనుచు దొంగ వర్తకుని కుమారుని బంధించిన త్రాళ్లు పఱపఱ కోసి వైచి, వానిని వదలినాఁడు. ఇద్దరును కలిసి యేద్వురు ! మఱెన్నఁడు నాకంటఁ బడకుఁడు, పొండు !...' అని చెప్పిదొంగ విసుగుకొనినాఁడు.

త్రాళ్లు కోయుటయే తడవుగ, వర్తకుని కొడుకు 'బ్రతుకు జీవుఁడా!' యనుకొనుచు కాలికొలఁది పరుగెత్తి, మాయమయ్యెను.

పోఁబోవుచున్న దొంగను దేవదాసు మఱల పట్టుకొని నిలిపి, ఈ దుర్మార్గపు వృత్తి మానుమని మఱిమఱి బ్రతిమాలెను. దేవదాసు నూఱిపోసిన బోధల నన్నిఁటిని దొంగ శ్రద్ధతో నాలించెను. కాని, యొక్కదానికేని బదులిడలేదు. గుఱ్ఱమెక్కి ఎక్కడకో దౌడు తీసెను.

మఱునాటి యుదయమున, ఎప్పటివలె దేవదాసు కొరకచ్చులను తడుపఁబోయెను. ఆశ్చర్యము!!—ఇపుడా మూఁడు కొరకచ్చులలోను మఱియొకటికూడ చిగిర్చెను— దానినుండియు నొక రేఁగుమొక్క మొలవనారంభించినది!!!

# 16. దివ్యజీవనము

దేవదాసు జీవితచక్రములో నింకొక పది వత్సరములు గిరగిరమని తిరిగిపోయినవి. అతని యునికి యక్కడనే స్థిరపడినది, మార్పులేదు. ఇప్పుడు దేవదాసున కేకోశమునను భయమనునది లేదు; కోరిక యనునది లేదు. 'బాబోయ్!—దొంగవచ్చి, కత్తిదూసి నన్ను చంపివేయునేమో' అను భయమెప్పుడో సమసిపోయినది, 'నన్నాశ్రయించిన శిష్య

గణము ఫలాహారములు తెచ్చియిచ్చినఁగాని నేనెట్లు జీవించఁ గలను?' అను బెంగయు తొలఁగిపోయినది. ఈ రెండు సమస్యలు దేవదాను మనఃఫలకమునుండి పటాపంచలయినవి.

'మానవుఁడెవ్వఁడును శ్రమపడి నా కాహారము తెచ్చి పెట్ట నక్కఱలేదు. దేవుని కరుణ యున్నఁ, దానంతట అదే యమరును. దేవుని నేను నమ్మియున్నచో నాతఁడే దాని యేర్పాటు చూడఁగలఁడు' అనునది అతని మొదటి నిశ్చయము.

'ఏ మానవుఁడును నిర్నిమిత్తముగ నాకెట్టి హానియుఁ గావింపఁజాలఁడు. ప్రభుని యిష్టప్రకారమే మానవునకు మేలు గాని కీడుగాని సంభవించును. శివుని యాజ్ఞలేనిది చీమయైన కుట్టనేరదు'—ఇది దేవదాసు మనస్సులో దృఢముగ పాదుకొనిన రెండవ విశ్వాసము.

ఈ నమ్మికలు రెండు నతని మనస్సులో నెప్పుడు పాదుకొనినవో, ఆ క్షణమునుండియు నతని జీవిత విధానములో నొక విధమగు నిర్లిప్తతయు అలముకొనినది. ఏక్షణమునందు దేవదానునకు మనస్సులో కోరికలు లేకుండ పోయినవో, తోడిమానవునివలన భయమనునది సడలిపోయినదో, అప్పుడే యాతని హృదయము తేలికపడినది. నోటిమాటలతో వెల్లడింపలేని యవిరతానంద ముదయించినది.

ఒక దినమున దేవదా సిట్లు తలంచెను :

'ఓహో!—దయామయుఁడగు నా దేవదేవుఁడు మానవజాతికొఱ కెట్టి సౌకర్యములను, సౌఖ్యములను సమ

కూర్చినాఁడు! ఆయన ప్రసాదించిన సౌఖ్యములను మాన వుఁడు సద్వినియోగము చేసికొనకున్నాఁడు. కావలెనని లేని పోని కష్టములు తెచ్చిపెట్టుకొని బాధపడుచున్నాఁడు!!'—

ఈ తలంపులతో, మానవులు చేయు నకృత్యము లెల్ల స్వానుభవమును పురస్కరించుకొని దేవదాసునకు వరుసగ గుఱుతునకు వచ్చినవి. ఒక్కపరి మానవజాతి హైన్యస్థితినిగుఱించి యతని మనమున విచారమొదవినది. 'ఇంతవఱకు నేను గడపిన నా జీవితవిధానము తప్పుదారి పట్టినది. నేను తెలిసికొనిన యీ పొరపాటును లోకమునకు తెలియఁజెప్పవలె' ననుకొన్నాఁడు.

ఇటు లతఁడనుకొనునంతలోనే దొంగవాఁడు తన దెసకు వచ్చుచున్న యలికిడి యైనది. 'ఈ దుర్మార్గుని కెన్ని విధముల నుపదేశించినను, వాని తలకెక్కుటలేదు. వాఁడొక పాషండుఁడు! వాని గుఱించి తాపత్రయపడుట కేవలము వ్యర్థము, నిరుపయోగము నని తోఁచెడిని. హుఁ—వాని దారిని వానిని పోనిచ్చుటే మేలు'...అని నిశ్చయించుకొని నాఁడు దేవదాసు.

ఇది తొలుత నతనికిఁ దట్టిన యాలోచన. లేచి, బయలుదేరి, రెండడుగులు వేయుసరికి దేవదాసు మనస్సు మాఱి, చేసికొనిన తీరుమానము తిరిగిపోయినది. దీనికిఁ గారణము గలదు.

ఇప్పుడు గుఱ్ఱముపై నెక్కివచ్చెడి దొంగవానిలో మునుపటి గర్వము, అహంకారము, భీతిఁగొల్పు రూపము

కానవచ్చుటలేదు ; పైఁగా, ముఖమున విచారరేఖలు గోచరించుచున్నవి. ఆతని దృష్టి క్రిందికి నేలపైపై వ్రాలియున్నది. ఇట్టి మార్పులతో దొంగను చూడఁగనే దేవదాసునకు జాలి కలిగినది. వెంటనే దేవదాసు దొంగవాని పాదములు రెండును పట్టుకొనినాఁడు.

''తమ్ముఁడా!—సమస్తలోకములను సృజించి, పెంచి, లయముచేసెడి యా పరమాత్మ నీలోపలనే నివసించి యున్నాఁడు. ఈ రహస్యమును తెలిసికొనలేకుంటివి. నిన్ను నీవు బాధించుకొనుచు, ఇతరులను హింసించుచుంటివి. ఎంత కాలము నిదియేనా వరుస? కాక మఱియేమి? జన్మములలో నెల్ల ఉత్తమమైన మానవ జన్మమెత్తి మనము చేయవలసిన కృత్యము లివేనా? 'నీవు తరించుచు, తోడివారలను తరింపఁ జేయు'మను భగవదాదేశమున కిటులేనా మనము బదులు చెప్పుట? మనము పాటింపవలసిన ధర్మములు, విధులు నివేనా?—''అనుచు ప్రశ్నపరంపర గుప్పించెను.

ఇందులకు దొంగ 'కి'మ్మనలేదు.

'తమ్ముఁడూ!—ప్రాజ్ఞుఁడవు, ప్రజ్ఞాశీలుఁడవు, శక్తిమంతుఁడవు, సర్వ సమర్థుఁడవు. ఒకరు నీకు చెప్పుటేమి? నీకు నీవే యాలోచించుకొనుము. కరుణామయుఁడైన సృష్టికర్త యెట్టి మహాపాపులనైనను క్షమించును. మానవులకు సౌఖ్యములను ప్రసాదించుటలో నా మహానుభావునికి పుణ్యాత్ములు, పాపాత్ములు అను విచక్షణ లేదు. ఆయన కెల్లరును సములే! ఆయన ప్రసాదించెడి సౌఖ్యములను సద్వినియోగము చేసికొను

టయు, దుర్వినియోగము చేసికొనుటయు మన చేతులలోనే యున్నది. ఐనదేదో యైనది. గతమునకు వగవకుము. ఇప్పటి నుండియైనను నీ వృత్తిని, జీవిత విధానమును మార్చుకో. ఇదే నేను నిన్ను కోరునది. ఏమనెదవు ?' అని దేవదాసు ప్రశ్నించెను.

అంతయు విని, దొంగ ముఖము ముడుచుకొనుచు 'పోనీయవోయి, వేదాంతీ!—నా దారిని నన్ను పోనిమ్ము...' అనుచు, పోఁబోయెను.

పోఁబోవుచున్న దొంగను దేవదాసు గట్టిగ పట్టుకొని నాఁడు. ఆతని దుస్థితి తలఁపునకు రాఁగా వలవల ఏడువ నారంభించినాఁడు.

దొంగ మెడయెత్తి, తనదృష్టిని దేవదాసు వదనముపై నిలిపెను. అదేపనిగ ఱెప్పవాల్పక, యాతని ముఖములోనికిఁ జూచెను. తదేకదృష్టితోఁ జూచెను. తన్మయుఁడై యటులు చూచుటలో, తనకు తెలియకయే గుఱ్ఱముపైనుండి క్రిందికి దిగజాఱెను. దిగజాఱిన యా చోరుఁడు దీనదృక్కులతో దేవదాసునకు మోఁకరిల్లెను.

'ఓయీ తాతా!—కడచిన ఇరువది వత్సరముల నుండియు నిన్ను నేను తీవ్రముగ ప్రతిఘటించుచు వచ్చితిని. ఇంతకాలమునకు నీవు నన్ను జయించితివి. నా కత్తికెదురు లేదని భావించిన నా యహంకారము సమసిపోయినది. ఇంత టితో నా అనుపమశక్తియు నాపై నాకుఁగలయాత్మవిశ్వాసము, సడలిపోయినవి. నీకు నేను పూర్తిగ వశుఁడనైతిని. నేను నీ

దాసుఁడను. ఇఁక నన్ను నీ యిష్టము వచ్చినటుల నుపయో
గించుకొనుము' అనుచుఁ దన మనస్సులోని పరితాపమును
వెల్లడించెను.

అటుపైని చోరుఁడు తనలోఁ గలిగిన మార్పులను
గుఱించి యిట్లు వివరింపఁజొచ్చెను :

'తాతా! — నీవు నాతో తొలిసారి ప్రసంగించినప్పుడు
నీ మాట యొక్కటియు నా చెవికెక్కలేదు. నన్నా ప్రసం
గము లేమియుఁ గదలించలేదు. బీడుపైఁ బడిన వానచిను
కులవలె నైనవి. నేను చలింపక పోఁగా, నీపయి నేను క్రోధముఁ
బూనితిని. దానితోపాటు క్రౌర్యముకూడ హెచ్చినది. ఎడ
తెగక నీవు చేయుచువచ్చిన ధర్మబోధలు, ఉపదేశములును -
నీవు నరునికంటెఁ బడకుండ నేకాంతముగ నునికి నేర్పఱచు
కొనఁ బోయినప్పుడు నా మనస్సుపై పనిచేయ నారంభించినవి.

'నిర్భీతి, నిఃస్వార్థము' అను గుణములను నీ వలవఱచు
కొనుటను నేను గమనించితిని. ఆహారముకొఱకు నీవు శిష్య
వర్గముపై నాధారపడకుండ పరమేశ్వరుని కృపమీఁదనే
విశ్వాసముంచినప్పటినుండి నిన్ను గుఱించి, నీ బోధలను
గుఱించి నామనస్సాలోచనలోఁ బడినది. నీలో ఎప్పుడిట్టి
నిర్లిప్తభావముదయించెనో, నాఁటినుండి నేనే నీకొఱకాహారపు
సంచి ననుదినము చెట్టుకొమ్మకు వ్రేలఁగట్ట మొదలిడితిని.
అది భగవంతుని యేర్పాటయియుండునను విశ్వాసముతో
నీవు స్వీకరించుచుంటివి' అని యతఁడు హృదయము విప్పి
యింకను ఏమో చెప్పుచునే యుండెను.

అంతలో దేవదాసున కానాఁటి కుటీరములోని యిల్లాలి సంగతి స్ఫురణకు వచ్చినది. 'ఆమె మురికి యోడు చున్న తన చేతిగుడ్డను శుభ్రపఱచుకొని వచ్చి తుడిచినప్పుడే బల్లలు, అద్దములు బాగుపడినవి. అటులే, నాలోని 'అహం' పోయినతరువాతనే, నన్నుగురించి నేను యోజించుట మాను కొన్న తరువాతనే హృదయము పరివర్తన పొందుటకును, పరిశుద్ధము కావించుకొనుటకును, తన్మూలమున నితరుల హృదయ మాలిన్యము తొలఁగించుటకు నవకాశము చిక్కి నది'అని తలపోసెను.

అప్పుడు దొంగ మరల 'నీ వేక్షణమున చావునకు వెఱువక, గుండె దిటవుపఱచుకొని ధైర్యముతో నిలువఁబడి తివో, ఆ క్షణమునుండియు నా హృదయము చలింపఁ జొచ్చి నది' అని దేవదాసుతో చెప్పినాఁడు.

ఈ మాట వినుటతోడనే, ఆనాఁడు చక్రాల కినుప కట్లు బిగియింప యత్నించిన యువకులు దేవదాసునకు గుర్తు వచ్చినారు. వారు, చక్రము నొకచోట స్థిరపఱచిన పిమ్మట గాని, అటుయిటు కదలెడి ఇనుపకట్లు ఎక్కించలేకపోయిరి. ఈ సంఘటనముకూడ దేవదాసున కొక పాఠము నేర్పినది. ఆతఁడు మరణమునకు భయపడక, ఏనాఁడు దేవునియందే నిండు విశ్వాసమును నిలిపియుంచెనో, నాఁడే, కలఁత చెందిన యాతని మనస్సునకు స్వాస్థ్యము కుదిరినది.

అప్పుడు దొంగ మరల నిటులనెను: 'నన్ను గుఱించి నీవు జాలిపడి కన్నీళ్లు రాల్చినవెంటనే నా హృదయము వెన్నవలె కరఁగిపోయినది'.

ఈ వార్త దేవదాసున కెనలేని సంతోషము నుప్ప తిలఁజేసినది. ఆ క్షణమే యతఁడు దొంగవానిని, తాను కొరకచ్చులు పాఁతిపెట్టిన తావునకుఁ దీసికొనిపోయెను. ఇరువురును వానిని పరికించిరి. ఆశ్చర్యమాశ్చర్యము!!—మూఁడవ కొరకచ్చుకూడ చిగిర్చి, మొలకెత్తియున్నది!!!...

ఇప్పుడు దేవదాసున కా యరణ్యమందు చలిమంట వేసికొనుచున్న కుట్టివాండ్ర సమాచారము జ్ఞప్తికి వచ్చినది. వారు చిదుకులను బాగుగ రాఁజుకొనిచ్చిన తరువాతనే జ్వాల లెగసి వారి చలిబాధను తీర్చినవి. ఈ సామ్యమును తన జీవితముతో సమన్వయించి చూచుకొనినాఁడు దేవదాసు. ఎటులనఁగా—దేవదాసు హృదయము నావరించియుండిన కలుపుమొక్కలు దగ్ధములైన తరువాతనే అందుండి జ్ఞానజ్యోతి యనెడి వెలుఁగు ప్రకాశించినది. అంతటితో నతని కన్నులకు క్రమ్మియుండిన మాయపొర తొలఁగిపోయినది.

ఇట్లు దేవదాసు—తన యనుభవమునకు వచ్చిన సంఘటనలవలన జీవితములో గొప్ప పాఠములు నేర్చుకొనఁగలైను. ఆ సంఘటనలను తన జీవితమునకు సమన్వయించు కొన్నప్పుడు 'యింతటిలో నా పాపములకు పరిహారము కల్గినదికదా' యని, అతఁడు మితిలేని యానందముపొందెను.

ఇవ్విధమున తాను తరించుటయే కాదు. జీవనమునకై దుర్మార్గప్రవృత్తిని చేకొనిన దొంగకు సయితము హృదయ పరివర్తనము కలిగించి, అట్టి పాషాణకర్కశ హృదయునకుఁ గూడ తరణోపాయము చూపఁగల్గిన దేవదాసు ధన్యజీవికదా! అటువంటి ధన్యాత్ముఁడు, ఆ దొంగనే తన ప్రియశిష్యునిగ గణించెను. తన జీవితాశయములు, తాను పొందిన గురూప దేశములు, ఆ యుపదేశములను సఫలీకృతము చేయుట కతఁడు పడినపాట్లు, చివరి కెట్లులైననేమి, తన పాపములు విముక్తములైన తీరు — లోకములో ముందుతరములవారికి మార్గదర్శకములగు నివన్నియు దొంగకు విప్పిచెప్పెను. ఇట్లు చెప్పుటతో నీ లోకమునకు వచ్చినపని దేవదాసునకు తీఱినది! అతఁడు చరితార్థుఁ డాయెను.

దేవదాసు ననంతరము—దేవదాసునే తన గురువుగా ఎంచుకొన్న దొంగ, ఆశ్రమవిధులను తనపై వేసికొని, లోకోప కారార్థము వానిని నెఱవేర్చుటలోను, లోకులకు పరమార్థ మును బోధించి ముక్తిమార్గము చూపుటలోను తన జీవిత మును వినియోగించి, తరించినాఁడు.



# సమాలోచన

"Ye have heard that it was said, An eye for an eye, and a tooth for a tooth, but I say unto you, Resist not him that is evil."—*Matt.* v. 38,39.

"కంటికి కన్ను, పంటికి పన్ను అని చెప్పఁబడినమాట మీరు విన్నారుగదా : నేను మీతో చెప్పునదేమనగా : దుష్టుని ఎదిరింపకుఁడు."

—మత్తయి : V—88, 39.

"Vengeance is mine; I will repay."

—*Rom.* xii. 19.

"పగతీర్చుట నా పని, నేనే ప్రతిఫలము నిత్తును."

—రోమా : XII—19.

తన రచనలన్నిఁటికి టాల్స్టాయ్ మహాశయుఁడు ప్రేమసందేశమును ప్రాతిపదికగా పెట్టుకొని యున్నట్టు ముందే తెలిసికొని యున్నాము. ఈ ప్రేమసందేశమును పలు దృక్పథములనుండి ఆయన చిత్రించును. ఒక్కొక్క దృక్పథము ఒక్కొక్క సమస్య యగును. ఆ సమస్యలకు తగు సమాధానములే టాల్స్టాయి రచియించిన కథలు.

ఇపుడీ కథాసందర్భమున మన కొక విశిష్టమగు వైచిత్రి కాన్పించును. ఇందు తొలినుండి తుదివఱకు కథ నడపెడి వ్యక్తి— దేవపుత్రుఁడు—అనఁగా దేవదాసు ఒక్కఁడే. కథ నడపెడివాఁడు దేవపుత్రుఁ డన్నప్పుడు, కథను నడపించెడివాఁడు 'దేవపిత'యను విషయమును మఱువరాదు. 'దేవపిత' యననేమి? — ఆయనే దేవుఁడు, జగన్నాటక సూత్రధారుఁడు. పూర్వజన్మపుణ్యమును బట్టి కేవలము ఆ దేవుఁడే దేవదాసునకు 'దేవపిత' యాయెను. ఐ, వానికి నామకరణమూ

చేసెను. 'ఈ బుడుతఁడు వర ప్రసాదమున పుట్టినవాఁడు, దైవాంశ సంభూతుఁడు, అసామాన్యుఁడు' అని చెప్పిపోయెను. తదుపరి దేవదాసునకు ప్రాజ్ఞత వచ్చినపిమ్మట సాక్షాత్కరించి, పలురూపుల మెఱసి, వివిధములగు పరిస్థితులు కల్పించి, అతఁడు పాపవిముక్తుఁడగుటకు తెన్ను చూపెను.

దేవదాసు పాపాత్ముఁడగుట దేవుని యుద్దేశము కానేకాదు. మానవ నైజస్వభావము ననుసరించి దేవదాసు పాపము లొనరింప వలసివచ్చెను. లోకులకు స్వయముగ బోధించి చూపుటకే అతఁడు కష్టములలో చిక్కుకొని వానిని భేదించుకొని బయటపడుటకు ఈ దృక్కుఁడు కావలసివచ్చెను.

ఇఁక కథపట్టునకు వత్తము—

దేవదాసు సుగుణశాలి. పిన్నవాఁటనుండి పాపభీతి, దైవభీతి కలవాఁడు. తలిదండ్రులయందు భక్తిప్రపత్తులు కలవాఁడు. అప్రత్యక్షుఁడై యుండిన తన దేవపితను దర్శింపవలెనను అమితాసక్తి కలవాఁడు.

దేవపిత దర్శనమైన క్షణము నుండియు నాతనికి జ్ఞానమను వెలుఁగు ప్రకాశింపఁ జొచ్చినది. అప్పటి నుండియే పాపపుణ్యముల విచక్షణ యేమో తెలిసివచ్చినది. దేవపిత పలుకులు మంత్రాక్షతలవలె అతనిపై పనిచేసినవి.

దేవపిత చెప్పినటు లెల్ల అక్షరశః అతఁడు నడచుకొనసాగెను. దేవపిత యందు అతనికిఁ గల అపరిమితమగు భక్తియొకటి, దేవపిత తనకు అప్పగించిన దివ్యభవనముపైని మక్కువయొకటి—ఈ రెండును దేవదాసు అటనే నిలిచిపోవుటకు కారణములైనవి.

ఇంతవఱకు సత్యముగ నడచుకొనుచు వచ్చిన దేవదాసు పాపమొనరింపఁ బూనుటకు హేతువైనది ఆకర్షణీయమగు ఆ భవనములోని 'ముద్రవేసిన చిన్నగది'. వలదని శాసింపఁబడిన ఈ గది తెఱచుటతో దేవదాసు మఱియొక ప్రపంచమున ప్రవేశించినట్లయినది.

దేవదాసునకు ఇప్పట్టునఁ గల్గిన మమత అతని మనస్సునే లోఁబఱచుకొని జయించినది. అందుచేతనే అతఁడు దేవపిత మాటను జవదాటవలసివచ్చినది. ఈ ఉల్లంఘనమే దేవదాసు పాపములకు అంకురార్పణమైనది.

కాని—ఈ పని అతఁడు ఉద్దేశపూర్వకముగ చేసినదికాదు. పరి

స్థితులే అతఁ డటులఁజేయుఁ బురి
కొల్పినవి.

మరల దేవపిత వచ్చి మందలించు
టతో దేవదాసు పశ్చాత్తప్తుఁడయ్యె.
గతమునకు క్షమించి, ముందు
మార్గము చూపుమని దేవపితకు
భక్తితో ప్రణమిల్లినాఁడు.

అప్పుడు దేవపిత గుహలోని
యతీశ్వరుని గురించి చెప్పుటయు,
జరిగినదంతయు దాఁపరికము లే
కుండ ఆయనకు నివేదించుకొని,
ఆయనవలన ముక్తిమార్గము తెలిసి
కొనుమనుటయు, దేవదాసునకు
అమృతతుల్యములగు హితవులైనవి.
అందుచేతనే, ఎన్ని పాట్లయినఁబడి,
మహారణ్యములో యతీశ్వరుని గుహను
వెదకుచుఁ బోయెను. 'శిక్షవలన
పాపము సమయుననుట కల్ల' అను
సూత్రముకూడ దేవపితవలన అతఁడు
తెలిసికొనెను. కాని, ఈ సూత్రము
యొక్క సాధ్యాసాధ్యములు ఆచ
రణములో ఎట్లు పరిణమించునో ఆ
విషయము మాత్రము దేవదాసునకు
అప్పటికి అవగాహనము కాలేదు.

తదుపరి___

దేవపిత మాటల యందెంత గురి
యుంచెనో, గుహలోని యతీశ్వరుని
పలుకులకు అంతటి విలువ ఇచ్చి
దేవదాసు నడచుకొన సాగెను.
లేకున్న ఎందుకు పనికిరాని కొర
కచ్చులు మరల చిగుర్చునని చెప్పిన
యతిపలుకులపై గ్రుడ్డినమ్మక ముం
చుట ఒక్క దేవదాసునకే చెల్లినది.
యతీశ్వరునియందు పూర్తి నమ్మ
కము గల దేవదాసు ఆయన ఏమి
చెప్పినను నమ్ముటకు సిద్ధముగనే
యుండెను. విశ్వసించుట తక్క ఆ
మాటలయందలి సత్యాసత్యములతో
నతనికి పనిలేదు. 'ఆ యతీశ్వరుఁడు
చెప్పినట్లెల్ల నడచుకొను'మని దేవపిత
చెప్పిన హితవు దేవదాసునకు సదా
మనస్సులో మెదలుచునే యుం
డెను. అందుచేతనే యతీశ్వరుఁడు
'ఈ కొరకచ్చులు తడుపుచుండుము;
ఇవి కొంతకాలమునకు చిగురించును'
అని చెప్పగా, ఆ మాటలను పూర్తి
విశ్వాసముతో దేవదాసు నమ్మి
నాఁడు.

నమ్ముటయేకాదు, ఎంతో ఓరిమి
పట్టి కాయకష్టమును లెక్కసేయక,
పుక్కిటితో ఏటినుండి నీళ్లుతెచ్చి,
కొరకచ్చులను తడుప మొదలిడి
నాఁడు. ఇట్లు కష్టపడుటకు మొద
లిడినప్పటినుండియే దేవదాసుపై
లోకులకు గురుభావము అమరినది.

దేవదాసు యతీశ్వరుని గుహ
చేరుకొనుటకు ముందు అనుభవమైన
సంఘటనలు, ఒక్కొక్కటి ఒక్క

క్క నీతిని అతనికి బోధించినవి. లేఁగదూడను కలవరపెట్టిన కాఫ్రుల చర్యలు, ఇల్లు బాగుచేసికొను చుండిన ఇల్లాలి చేష్టలు, చక్రమునకు కళ్లు బిగింపనున్న యువకుల కృత్యములు, చలిమంట కాచుకొనుట కుద్యుక్తులైన పసుల కాపరుల పనులు—ఇవన్నియు తెలివితక్కువ కార్యములే.

దేవదాసు ప్రాజ్ఞుఁడు, పరిజ్ఞానము కలవాఁడు, కనుకనే వారి తప్పులను వారికి ప్రత్యక్షముగా కనఁబఱచి, సవరింపఁ గలిగెను. తాను చేసి చూపుటకు తగు సమర్థత కలవాఁడే ఇతరులకు బోధింప నర్హుఁడగునను ఒక గొప్ప సత్యముకూడ ఇందువలన విశదమగుచున్నది.

కాని, ఈ చిన్న సంఘటనలలో ఇంతటి మహత్తరములగు సూక్తులను బోధింపఁగల శక్తి ఇమిడియున్నదని తొలుత దేవదాసునకే స్ఫురించలేదు. తాను ఉన్నత శిఖరమున నున్నకదా, తోడివారలను తన అంతస్సునకు కొనిపోగలుట!

ఈ పరమ సత్యమును దేవదాసు, దొంగ తారసిల్లినప్పుడుకాని కనుగొనలేకపోయెను.

దొంగవాని కేమి! హత్యయనునది సామాన్య నిత్యకృత్యము. దేవదాసు ఉపదేశము దొంగను కొంచెమైన కదలించలేదు. ఈ యుపదేశములను దొంగ తృణీకరించుటయే గాక అది తన వృత్తిధర్మమని ధైర్యముతో బదులుచెప్పెను. అది దొంగవాని యహంభావమని దేవదాసు ఆరోపించినను, తాను సహితము మట్టి దోషమున కగ్గమగుట గ్రహింపఁ జాలక పోయెను.

తానేమో లోకము నుద్ధరించుటకే అవతరించినటులు, తనను చేరవచ్చెడి శిష్యగణ మంతయు తన ప్రబోధమువలన తరించిపోవుచున్నటులు—దేవదాసు మనస్సులో నొక అహంభావ మంకురించినది. 'ఇంత మందిపాపులను తరింపఁజేయుచున్నాను, నీకును ముక్తిమార్గముచూపెదను. రా రమ్ము!' అని తనంత తానే దొంగ నాహ్వానించుటకు దేవదాసు ఆయత్తపడెను. అనఁగా శిష్యుఁడు గురువు నాశ్రయించుటకాదు, గురువే శిష్యుని వెదుకఁబోయినట్టయిన దిక్కడ. ఇంతకంటె విడ్డూరమే ముందును? దేవదాసులో నుద్భవించిన అహంభావము ఎట్టిదో ఈసందర్భము చెప్పకయే చెప్పుచున్నది. దేవదాసు పట మనము చూడఁగల్గిన గొప్ప తప్పిదమిది యనుటకు సందియము లేదు. కాని, అదియే తుదకు

దేవదాసు తన జీవిత విధాన
మును పరిశీలించుకొనుటకు పురి
కొల్పినది. తన మనుగడకొఱకు
శిష్యులపై నాధారపడుటయు,
వారి మెప్పుల కుప్పొంగిపోయి,
కీర్తికాముఁడగుటయు — కానిపను
లని అతనికి తెలిసివచ్చినది.

ఆ క్షణమందే దేవదాసు గుహను
విడిచి పోయెను. నరుని కంటఁ
బడని నిర్జనప్రదేశమున నెలవు ఏర్ప
ఱచుకొనెను. దేవదాసులోని
స్వార్థాభిలాష సమయుటను దొంగ
గమనించెను. ఆ స్వార్థరాహిత్యము
తోడనే దొంగకు దేవదాసుపై గౌరవ
ముదయింపఁజేసినది. అతనిబోధనలకు
విలువనీయసాగినది. ఇచ్చుటచేతనే,
దొంగ అప్రత్యక్షముగ దేవదాసు
మనుగడకు వలయు ఆహారమును అను
దినము చెట్టుపై సమకూర్చి పెట్టు
చుండెను. మూఢభక్తితో మహిమలను
నమ్మెడి దేవదాసు, ఇదియు దేవుని
మహిమయే యని తలఁచుటయు సహ
జసిద్ధమే.

దేవదాసు తన పాప పరిహారము
నకు కల్పించుకొన్న ఉద్యమము
ప్రశంసాపాత్ర మయినదని చెప్ప
వచ్చు. దూరమునఁ గల ఏటినుండి
నీరు పుక్కిటఁబట్టి తెచ్చి కొర
కచ్చులు తడుపుట యనిన సామాన్య
కృత్యము కాదు. ఇదెంతటి కష్ట
సాధ్యమైనదో సామాన్యుని ఊహకు
అందరాని విషయము.

కాని దేవదాసు ఈ పనిని ఒకటి
కాదు, రెండు కాదు, కొన్ని వత్స
రముల తరబడి సాగించెను. 'పాప
పరిహార మెటులు?' అను సమస్య
యొకటే దేవదాసును వేధించుచుండి
నది. జీవితములో ఇదే అతని ఏకైక
లక్ష్యము. ఆ మనోవేదన ముందు
కొరకచ్చులు తడుపుటలోఁ గల
కాయకష్టము అతనికి తోఁచనేలేదు.

దొంగవాని హృదయము పూర్తిగా
పరివర్తనము చెందునప్పటికి దేవ
దాసునకు హృదయము పరిపక్వమై
సంపూర్ణ జ్ఞానవికాసము కలిగినది.

తొలుత, దేవదాసు శిష్యగణము
నుండి సంపర్కము తప్పించుకొనఁ
జూచెను. కాని, ఇది తప్పిన వెం
టనే దొంగవాని సమస్య మనస్సులో
ప్రవేశించినది. ప్రవేశించు టేమి,
క్షణక్షణము ఇది వర్ధిల్లుచునే యుండి
నది. ఇది — అనాఁడు ఇల్లాలు
మాటికిగుడ్డతో మేజాలు తుడుచు
టతో దేవదాసు సమన్వయించు
కొనినాఁడు. ఎటులనిన: ఆశ్రమములో
ఆశ్రితుల బంధము లతఁడు త్రెంచు
కొనినను, దొంగవాని సమస్యకు

సంబంధించిన పాపపంకిలము క్రొత్తగ నతని మనస్సునకు అంటినది.

తదుపరి—శ్రీమంతుఁడగు వర్తకుని కొడుకును గుఱ్ఱమునకు విఱచి కట్టి తెచ్చినపుడు దేవదాసునకు దొంగవాఁడు తన్ను చంపునను భయము తీఱినది. చావునకు తెగించి వాఁడు గనుకనే, 'వానిని విడువుము!' అని గద్దించి పలికి, దేవదాసు దొంగను శాసించెను. ఇట్లు మరణభీతి తొలఁగుటను అతఁడు ఆనాఁడు-యూదకులు చక్రములకు కట్లు బిగించుటతో పోల్చుకొనెను. ఇదెటులనిన: మరణ భీతి అణఁచిపెట్టుట కది లక్ష్య సాధనముగ అతఁడు గ్రహించెను. కావుననే బందీని సులువుగ విడిపింపఁ గలిగెను.

ఆనాఁడు పసులకాపరులు మంటను రగుల్చుకొన్న పిమ్మట చలి కాచుకొన గలిగినటులే, దేవదాసు తన హృదయమున దొంగను గుఱించిన ప్రేమాగ్ని చక్కఁగ రగులుకొన్న పిమ్మటనే అతనికి దొంగ వశవర్తి యగుటను కూడ దేవదాసు తన జీవితముతో సమన్వయించుకొనెను.

ఇవ్విధమున, దేవదాసు తనకు గోచరము కాకుండనే ఒక మెట్టు నుండి మఱియొక మెట్టుపై కెక్కుచు, తిన్నగ ముక్తిమార్గమునకు త్రోవ కనుగొనెను.

ఇంతకును—తాను ఉద్యమించిన మోక్షమార్గమునకు సన్నిహితుఁడగుచున్నటులు తెలిసికొనుటకు, దేవదాసున కా మూఁడు కొరకచ్చులు ఎంతయు తోడుపడినవి.

ఎంతో ఓరిమితో చిరకాలము పుక్కిటఁబట్టి తెచ్చి నీళ్లు పోయఁగా పోయఁగా, దేవదాసునకు దొంగ వలని భయము తీఱినంతనే మొదటి కొరకచ్చు మొలకెత్తినది. దొంగలో పరివర్తన ప్రారంభమగుసరికి రెండవది చిగిర్చెను. దొంగ పశ్చాత్తపుఁడై బాష్పకణములు రాల్చుటతో మూఁడవ కొరకచ్చు చిగురించెను.

ఇట్లు—దేవదాసు పాపులకొఱకే ఈ ప్రపంచమున జన్మించి, పాపములవలన కలిగెడి ఫలితములను తా ననుభవించి, ఆ పాపములనుపరిహరించుకొను విధానమును ప్రత్యక్ష నిదర్శనముల చేలోకమునకు చూపెను.

దేవపిత చూపిన మార్గములవలనను, చెప్పెడి హితవులవలనను దేవదాసునకు పాపపుణ్య విచక్షణ జ్ఞానము కలిగెను. ప్రాజ్ఞత మెఱయు [illegible] దేవదాసు అజ్ఞులను సరిదిద్దెను:— [illegible] తాను తరించి,

లోకమున కతఁడు తరణోపాయము చూపఁగల్గెను.

మొదట చెప్పినటులు, ఈ కథ నడిపినది ఒకేఒక వ్యక్తి-దేవపుత్రుఁడు లేక దేవదాసు. అహింసాతత్త్వమును, ప్రేమసూత్రమును ప్రపంచమునకు బోధించి, స్వానుభవముచే ముక్తి మార్గమును వెల్లడించిన దేవదాసు మహాయోగి.

ఆ దయామయుఁడగు దేవపిత ప్రపంచమున జరిగెడి పాపకార్యములు దేవదాసుకంటఁ బడునట్లు చేసెను. ఆ పాప కార్యములన్నిటికి పరిహారము చేసికొను మార్గము కనుఁగొనుటతో తృప్తిపడక, ఆ స్వానుభవములను సందేశరూపమున లోకమునకు వెల్లడించుటకు తగిన దేశికు ననుగూడ సృష్టించెను. ఆదేశికులలో ముఖ్యుఁడే దేవదాసు — మానవులను తరింపఁజేయ నవతరించిన చరితార్థుఁడు!

ఈ దేవదాసు కథలో, టాల్స్టాయి బోధించెడి ప్రేమతత్త్వము మహోజ్జ్వల మయినది. తరతరాల నుండి అమలులోనున్న శిక్షాస్మృతినే తారుమారు చేసి త్రోసి రాజనుటకు పాహాసించుచున్నాఁడాయన. లోకమున మనకు [illegible] ములను, పాపములను, మంచిమాటలచే-ప్రేమతత్త్వముచే-ప్రబోధముచే తొలఁగింపఁజేసి, మానవునిలో పరివర్తనము కలిగింపవలెననునదే టాల్స్టాయి ఉద్దేశమైనట్టు, ఈ కథలోని సంఘటనలు తొలినుండి తుదివఱకు వ్యక్తము చేయుచున్నవి. అంతియు కాని, 'దెబ్బకు దెబ్బ తీయుము' 'విషమునకు విషమే విరుగుడు' అనెడి సిద్ధాంతములను టాల్స్టాయి సహింపడు. ఇవ్విషయము 10-వ ప్రకరణములో స్పష్టముగ కానగును.

నిత్యకృత్యములలో మన మనుదినము చూచి, చేసెడి చిన్న చిన్న అనుభవములనే ఉపమానములుగ తీసికొని, మహత్తర విషయములను మనస్సున కెక్కునట్లు బోధించుచున్నాఁడు టాల్స్టాయి మహాశయుఁడు.

మచ్చునకు—ఇంటిలోని మేజా తుడుచుట, బండిచక్రములకు కట్లు ఎక్కించుట, తుక్కు ప్రోగుచేసి చలిమంట వేసికొనుట-ఇట్టి వన్నియు ఏమంత అపురూపవిషయములు? కాని, దేవదాసు కథ యంతయు ఇటువంటి అల్పవిషయములపైననే ఆధారపడి యున్నది. ఇదే ఇందలి విశిష్టత.

